శ్రీ

# నిర్వచన సంగ్రహ
# రామాయణము




రచయిత:

**ఈమని వేంకటకృష్ణయ్య**

యల్లయపాళెం



శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానమువారి
"ఆర్థిక సహాయమున"
ముద్రింపబడినది.

# తొలి పలుకు

భక్తాగ్రేసరులారా !

ఈ చిఱుత కబ్బంపు మొలక మా పెదతండ్రిగారైన యామని జానకీ రామశర్మగారి హృదయ క్షేత్రమునసుద్భవించినది బాలకాండ మురో "శివధనుర్భంగము" వఱకొతినిచే వ్రాయబడినది. అనంతరము వ్యాధిగ్రస్తులై శేషభాగముఁ బూర్తిడేయఁ జాలక పరమపదమును జెందిరి.

తదాదిగ నాకీపొత్రమును బూర్తిచేయవలెనను సంపూర్ణాభి మానము కలిగి, నాయున్నస్వల్పజ్ఞానముతో నేనిది పూర్తిచేయగలనా? లేనా? యను విచక్షణఁగూడ చేయక ప్రారంభించితిని శ్రీరామకటాక్ష వీక్షణ పరంపరాగతి పరిజ్ఞానమువలనను మా పెద తండ్రిగారి యను గ్రహమువలనను తుదకు పూర్తిచేసితిని

పూర్వ కవుల పద్ధతివలెగాక, యీగ్రంధములోని విశేష మేమన గ్రంధమంతయు నిర్వచనము షట్కాండలును షడ్విధవృత్తసంచయ ముచేఁ బూర్తి చేయఁబడినవి

అప్పటినుండి నీగ్రంధమును ముద్రించు ప్రయత్నములుచేసియు విఫలమనోరధుడనై కొంతకాలమాప్రయత్నమును విరమించియుంటిని కొందఱు మిత్రులప్రోత్సాహముచే గత సంవత్సరము శ్రీ తిరుమల తిరు పతి దేవస్థానము వారికి ఆర్థికసహాయమునకై విజ్ఞప్తినిపంపుకొనుటయు వారందులకంగీకరించి దనసహాయము నేయుటయు జరిగినది వారికి సర్వదా, సర్వథాకృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను

* ఈ గ్రంథము ముద్రణలో ఉమ సంపూర్ణ సహాయసహకారము లందించి మాకెంతో చేదోడు వాదోడుగ నున్న శ్రీ వేంకటే శ్వర విశ్వవిద్యాలయ రిజిష్ట్రారుగారైన శ్రీ కె. చంద్రశేఖర రెడ్డిగారికి సహృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును బరించి, కొందఱిచ్చిన యమూల్యాభిప్రాయ ములను గ్రంథారంభమునఁ జేర్చియున్నాను. పెద్దలగు భక్తజనులందఱు నాశీర్వదించెదరని నా నమ్మకము.

సుబుద్ధులగు వారలకీ గ్రంథము తేనెపెర, పనసతొళ్ళ ద్రాక్ష గుత్తి.

చ॥ అమరమెఱుంగనయ్య మఱియాంధ్రసుశబ్దపుఁ బొప్పెఱుంగనే
విమలప్రబంధసంచయను విన్నదిరేదు బుధాళిదర్శనం
బమరినదన్న గాదు సుసుణాంచితపండితవర్యులార ! మీ
సుమనముల్దలంచి నెరసుల్గలవేని గణింపకుండుడీ !

బుధజనవిధేయుడు,
ఈమని వేంకటకృష్ణయ్య
యల్లయపాళెము

## ఈ గ్రంథముపైఁ బెద్దలొసగిన యభిప్రాయములు :

ఈ "రామాయణము" నామూలాగ్రముగఁ బరిశీలించితిని. సాంఘికోన్నతిఁ బ్రసాదించులోకోత్తరమైన యితివృత్తము. శైలి సరళము. అన్వయము సౌలభ్యము. లలితమధుర సంస్కృత పద విన్యాస విలసితము. కవిత యిరువురిదైనఁగను గొనరానంత కలయికతో నొప్పుచున్నది. ఈ గ్రంథమును టూరించిన కవి చిన్నవాడయ్యును ప్రౌఢకవులతో సమానముగఁ గవనమల్లినాడు ఇతనికి సుజ్జ్వల భవిష్యత్తున్నదని యాశించి, యాశీస్సునిచ్చుచున్నాను.

విద్వాన్ **రామిరెడ్డి నారాయణరెడ్డి**
(ప్రధానాంధ్ర పండితులు రిటైర్డు)
నెల్లూరు

భో భో ! విద్వదగ్రేసరా ఈమన్యుపనామ్నా వేంకటకృష్ణ శర్మణా విరచిత "నిర్వచన సంగ్రహరామాయణ" మామూల చూడ మద్రాక్షం. బాలస్యాపేః తస్యకవేః కవితా స్వభావమధురా కోమలపద గుంఫితా పరీవర్తీ త్యేదతీవ మోదాస్మః అనేకగుణభూయిష్ఠాపి స్వభావ మాధుర్య రహితా కవితా సద్వృత్త రహితేవ ప్రశంసాస్పదం భవతి. అస్యబాలకవేః కవితాయాంధారా శుద్ధిశ్చ సులలిత మేతత్కనక సుగంధ న్యాయమనుసరతి విశ్వరక్షక శ్రీకృష్ణపరమాత్మకవేః యితోధికాం కవితా శక్తిందత్వా దీర్ఘాయురనుగ్రహో త్విత్యా శాస్మహే॥

**పైడిమఱ్ఱి చంద్రశేఖరశాస్త్రి**
తర్క వేదాంత విద్వాన్
ఖమ్మం

విద్వత్కవివరులార ! సాహితీ పరులారా !

"నిర్వచన సంగ్రహరామాయణము" అను పేరు గల యీ కావ్యము కవిగారు దయతో నొసంగుటచే తద్గర్భిత రసాస్వాదనము సేయు భాగ్యము లభించినది వీరు వయసునఁ జిన్నవారయ్యును, సాహిత్యానుభవమున మిన్నలై, ప్రౌఢ కవులలో నెన్నఁదగినవారనుట కీపొత్తము తార్కాణము నాతికరినమై, సమాన ప్రయోగిత సంస్కృతాంధ్రి సమాసఘటితమై శబ్దార్థాలంకార రంజితమైన యీ కావ్యము సర్వజనపఠనీయము. షట్కాండలును, షడ్విధవృత్తసంచయముచే రచింపబడుట, వీరి మధురానర్గళ కవితాధారకు, సాహిత్యరంగమునందు వీరికిఁగల యనుపమాన పరిశ్రమను దెటతెల్లమొనర్చుచున్నది. శ్రీరామచంద్రమూర్తి నిజకరుణా కటాక్ష వీక్షణములచేఁ గవిగారికి దీర్ఘాయురారోగ్యములిచ్చుగాక ! వేంకటకృష్ణశర్మగారూ !

మ॥ రసవచ్ఛబ్ద ప్రయోగచాతురికళా రాజత్సుపద్యావళీ
ప్రసవానీక వినిర్గతోత్పరిమళ ప్రాధాన్యసంయుక్తమై
యసమానాంచిత శైలిసంయుతమునై యాద్యంత మాధుర్యమై
రసముంగ్రక్కుచునుండెఁద్వద్రచితమౌ రామాయణ 'గ్రంథమున్'

సుధీజనవిధేయుడు,

చతుర్వేదుల ప్రభాకరశాస్త్రి బి. కాం.
హైదరాబాదు

కవి చిన్నవాడయ్యుఁ బూర్వకవులతో సమానమగు కవితఁ జెప్పినాడు. గ్రంథమంతయు గ్రంథకర్తచేఁ బూర్తిగఁ జదివించుకొని వింటిని. చాల బాగున్నది లలితపద భూయిష్ఠమై షట్కాండలును షడ్విధవృత్త సంచయముచేఁ బూర్తిచేయఁబడుటఁగడుంగడు ముదావహము. భగవానుదే తద్గ్రంథకర్త కాయురారోగ్య సంపదలనిచ్చుగాక !

గుమ్మా నారాయణశాస్త్రి
సంస్కృత పండితుడు
యల్లయపాలెము

# ప్రార్థనాది పద్యమంజరి

శా॥ శ్రీకై వల్యపదప్రలబ్ధికొఱకై సేవింతు మాయావిధా
స్తోకాకల్ప చరాచరాన్విర జగత్స్తోమ స్థితాత్మోదరున్
లోకాదీశు నిరీశు యోగిజనలోలున్ భక్తమందారు స
త్యాచారు న్నిగమాంత వేద్యుని యశోదాసూను "గృష్ణాకృతిన్"

క॥ శ్రీలక్ష్మీనారాయణ
లీలావిర్భూత నిఖిల లేఖామోద
శ్రీయుర సీతారాముల
లాలిత పదపద్మయుగములను నుతియింతున్

చ॥ అరయ ననేకజాతికుసుమావళులన్ తులసీదళంబులం
దరమిడి పూజసేనెడివిధం బదితప్పనరాదుగాని నే
నరుదుగ వేఱువేఱ గుసుమార్చనఁజేసినయట్లు వృత్తముల్
వరుసగ నొక్కడొక్కడుగ భాగములారిటిఁజేయఁ బూర్తిగన్

ఉ॥ భాసురమైన దాశరథి భవ్యచరిత్రను సంగ్రహంబునన్
వేసటలేర్చి నూతనకవీశ్వరమండలిమెచ్చఁ జేయుచున్
దాసులఁగాచు నీశ్వరునిధర్మువు నాశ మొనర్చుపట్టు నా
భూసురుడైన సత్కవియుఁ బొల్పుగఁబూర్తిగఁజేయ నెంచటన్

మ॥ సకలప్రాణి హృదంబుజాతముల నాస్వల్లీలమైవెల్గు నా
యకలంకుండగు బ్రహ్మమూర్తిని అదియంతై నరోకంబునన్

ప్రకటాశ్చర్యవిదంబుఁదోపఁగొనగన్ బాలుండనౌనేను శే
షకథంజెప్పఁగఁబూని మాధవుదయన్ సంపూర్ణమొప్ప న్సుభవిన్

సీ॥ జానకీరామాఖ్యఁ జరితార్థుడైనట్టి
ఘనుని మా పెదతండ్రిఁ గరము మెఱయఁ
గరములుముకుళించి గాఢంబుగా మ్రొక్కి
తక్కటిసుతవులఁ దనరఁగొల్చి
వైకుంఠవాసుఁడై వఱలుచుండెడిదేవు
పాదపద్మంబులు భక్తిఁదలచి
మద్గురూత్తముల నమస్కృతశతములఁ
బరివృత్తులనుజేసి పరమతోష

తే॥ గీ॥ మునను బట్టితిఁ బొత్తముఁ బూర్తిఁజేయ
స్వర్గలోకముఁజేరిన శర్మకెపుడు
శాంతిఁజేకూరు గాత! దోషంబులున్న
నొప్పులుగఁజేసికొనుడు వినోదమలర

## ఆంజనేయస్తుతి

దం॥ శ్రీరమణీయవేష కబళీకృతపూష నిరస్తదోష దో
స్సారవిశేష భోగివరసన్నుతభాష జగద్ధితైష ఘో
రారిసమూహశోష ప్లవగాన్వయభూష బుధాళితోష సీ
తారమణీగవేష జితతామరసాజమనీష మారుతీ॥

## వేంకటేశ స్తవము

చ॥ వరదుని యేడుకొండల నివాసుని యవ్యయు భక్తరక్షణా
భరణుని కామితార్థదుని భావభవారినుతాంఘ్రిపద్మునిన్
పరమపవిత్రనాముని యపారకృపాంబుధి నాదిదేవునిన్
"తిరుమలవేంకటేశ్వరు" నుతింతును యస్మదభీష్టసిద్ధికై

## సాయిబాబా ప్రార్థన.

చ॥ సరసిజనాభరూపుని విచారవిహీనుని శిష్యకోటిసం
భరితుని నిత్యతోషుని యపారదయామతినిన్ ఫకీరునిన్
వరమగు "షిర్డి" పట్టణనివాసుని మామకమానసంబునన్
కరమనురక్తిఁ గొల్చెదను కామితసిద్ధుని "సాయిదేవునిన్"

భక్తపాదరేణువు,
ఈమని వేంకటకృష్ణయ్య
యల్లయపాలెం.

# శ్రీ రామాష్టకమ్॥

శ్రీమత్కాకుత్స్థవంశేన్ద్రం శ్రీకరం సేవితామరం
రాజీవలోచనం రామం ముహుర్ముహురహంభజే॥
అయోధ్యాపురి నేతారం అజ్ఞానాంధితమోపహం
అవ్యయానన్దపదదం రామంముహురహంభజే॥
కల్యాణగుణసంపన్నం కపర్దీజపితాహ్వాయమ్
కౌసల్యానన్దజలధిం రామంముహురహంభజే॥
చారులక్షణసర్వాంగం చండాంశుకులమండనం
చరాచరజగన్నాథం రామంముహురహంభజే॥
టంకారజ్యారవామాత్ర మూర్ఛమానమహోదధిమ్
దంభాసురాబ్జమాతంగం రామంముహురహంభజే॥
పంక్తికంధాద్రిదంభోళిం పావనంపాపశోషణం
భుక్తిముక్తిప్రదాతారం రామంముహురహంభజే॥
యజ్ఞవిఘ్నామరారిఘ్నం యశోవ్యాప్తత్రివిష్టపమ్
యమయాతనవిధ్వంసం రామంముహురహంభజే॥
శాంతస్వాంతంసుప్రసన్నం శ్యామాబ్జంశర్మదాయకం
శారదాభ్రప్రభాకీర్తిం రామంముహురహంభజే॥

ఇతివర్గాష్టకం రామసంగతంయః
పఠేన్నరః సర్వపాపవినిర్ముక్తం
తతోయాతి పరాంగతిం

# బాలకాండ



క॥ కోసల దేశంబందున
భాసిల్లు నయోధ్యయనగ వరనగరము వి
ద్యాసవరమై యోధా
గ్రేసరధామంబయి మహికిన్మణినిభమై

క॥ ఆనగరము దశరథభూ
జానియనన్ భానుకులుఁడు సంతతకరుణా
మానాధీనస్వాంతముఁ
బూని ప్రజల నేలుచుండె ముదమొదవంగన్

క॥ ఆతనిచేతోవృత్తికిఁ
బ్రీతిగననవరతభక్తి విస్తృతమతులై
పూతచరిత్రలు సతులు
ఖ్యాతలు సల్లక్షణాన్వితాకారములన్

క॥ కౌసల్యయన సుమిత్రయు
వాసిగఁగైకేయియనగ భార్యాత్రయమా
మాసతి భారతి హిమగిరి
జాసతి కెనయనగ సుగుణసంపదనలరున్

క॥ వితరణఖనియగు దశరథ
పతి హితమునసాతతంబు పరమార్థముగన్
మతిఁదలఁచి మెలగుచుందురు
మతిమంతులు మంత్రు లరులమర్మజ్ఞులునై

క॥ హరివరముఖాసి దశరథ
నరపతి యాధరముఁజేసి నగరరాజంబుల్
విరివిగఁజరిపించెనో యను,
వెరపునఁ గరికరము మొప్పు వేసుకసపటన్

క॥ సురవరువాహనకులమున
జిరముగ జన్మించి హరిణాక్షిమృగసుతయున్
సంకుగొననగునె మరకను
బరువున హరులలరు నధికహాసుంజపతన్

క॥ సురగిరిశిఖర మొఁదోలెడి
యురిదంటులసంక్తహాస్య నస్ఫురితోనన్
కరువలిఁగరములఁబట్టెడి
వరవీరభటాళి యందువసియింద్రుఁదగన్

క॥ అప్పురిఁగల యుప్పెంగలు
నుప్పరమును సొంపి సొప్పుహారికెసుపలవల్
గప్పుఁగజందునిమప్పియుఁ
గప్పునుసితిమెప్పుఁగలుగు హాంరిన్ చెందున్

క॥ కోరక కుట్మల సుమఫల
భారాధిక వృక్షకుల పావపతతులున్
భూరిలతాసుమసౌరభ
సారంబై నిష్కుటాళి సంకటిలంబున్

క॥ అనాసైనమెప్పుంచ్చటి
ద్విజులం మించిదివుచేని వృద్ధుంధనుడుక్
గజనిర్ఘరరిపుశిప్ప ము
భజియించరు ఎవరు ప్రక్షిహాడని రాంభల్

క॥ అక్షయధనవర్గములకు
సక్షయమగు వైశ్యులచట శోభింత్రుఁదగన్
యక్షేశునైన నేలుదు
రక్షణభృతినొసంగి యాదరణమునన్

క॥ హలముఖసంలబ్ధశ్రీ
విలసిత సౌభాగ్యగరిమ వితరణగుణమున్
ఆలపూర్వభిషజ్ఞైశ్వ్యము
సులువుగమాన్పంగలట్టి శూద్రజనంబుల్

క॥ గురుమివసిష్ఠుండు పురం
దరుడుదశరథుఁడు సుపర్వనదిసరయువు స్వ
ర్పురియునయోధ్యయని యెం
తురు సంయమునులు విధూతదోషస్థలిగన్

క॥ దిగధశవరపురస్థితి
యగణితవిభవాభిరామమైన యయోధ్యా
నగరంబు నేలుచుండెను
జగతీశుడు దశరథుండు సచ్చరితమతిన్

క॥ వితరణఖనియన దశరథ
పతిఁ బొగడిరి సర్వదేశవాసులధీశుల్
శ్రితవితతి విహితతతియున్
మతిమంతు డుదాత్తు డధికమాన్యుండనుచున్

క॥ రాజపభోగఖ్యాతులఁ
బూజితమైయెసగుచుండఁ బుత్రోదయ స
ద్భావితయోగముఁ గలుగక
నేజన్మము ధన్యమొందు నిందునుసందున్

క॥ అని చింతించుచు జనపతి
మనమునఁ దనయాభిలాష మల్లడిగొనగన్
వనజభవోద్భవు కులగురు
మునివరుని వసిష్ఠుఁ గాంచి మ్రొక్కిటులనియెన్

క॥ అనఘ గృహస్థాశ్రమమున
కెనయగు నాశ్రమముఁ గలదె నెందును మఱియున్
తనయయుతంబగుచోఁ ద
ద్ఘనతను వర్ణింపఁదరమె కంజజపుత్రా!

క॥ వరచతురంగబలంబులుఁ
దరుణులు రాజ్యంబు హితులుఁ దగు మంత్రివరుల్
విరివిగనుండియు సుతులను
వరభాగ్యముకొఱతఁ గరిగె వగపు జనించెన్

క॥ కావున సుతజన్మము నా
కేవిధిఁ బడయంగనగునొ నేర్పడ మీరున్
దేవునిపై భారంబున
గావింపుడు పుత్రలాభకార్యము నాచేన్

క॥ అనవిని వసిష్ఠసంయమి
మనమునసంతయును నెఱిగి మనుజాధిపునిన్
కనిపల్కె రవికులోత్తమ
తనయులుఁ గల్గుదురు నీకుఁ దధ్యంబనఘా!

క॥ విను పుత్రకామసవనం
బను యజ్ఞము సేయుమయ్య యచ్యుతుకరుణన్
తనయులు తప్పకఁ గల్గుదు
రనియుము సంతోషవార్ధియందున దేల్చ—

క॥ ఆవాక్యము వినినంతనె
భూవరుమన ముదధియటుల పొంగి వసిష్ఠున్
భూవిబుధోత్తమ మమ్మున్
భావిశుభప్రాప్తిఁగూర్చి పాలింపఁగదే

క॥ అన మౌని సంతసమునన్
మనుజాధిప ఋశ్యశృంగమౌనివరేణ్యున్
వనితాసహితంబుగ న
య్యనఘుని మఖమునకుఁబిల్వనగును శుభంబున్

క॥ అని ఋశ్యశృంగుచరితము
జనతికి న్దెలియఁదెల్పిసవనమొనర్పన్
తనయులఁగీర్తియు సౌఖ్యము
ఘనపుణ్యంబమరు విగతకల్మషయుతమై

క॥ కావున నాలస్యంబిక
గావింపక సప్తతంతుఁ గావింపుమొగిన్
శ్రీవిభుడు మిమ్ముఁ గృప సం
భావించునల దధ్యమింత వలపురిదారీ!

క॥ మునిమృదుల మధురసూక్తుల
విని మనుజవరేణ్యుడనియె విప్రోత్తమ! నీ
పనుపునొనర్తు మదీప్సిత
మునమానస వెలయఁజేయుము సదయహృదయా!

క॥ అనిపల్కి మునికివందన
మొనరిచి తత్సవనమునకు నుత్తమదివసం
బును నిర్ణయింపు మనుమా!
మనుకులపతిముకుటమంజు మణిరుచిచరణా!

క॥ అనఘాని సంతసమునన్
వనిఁబూని తదర్థములను బ్రారంభింపన్
యనువగు శుభదినమెల్లియ
యని తత్తద్యత్నములకు నమ్మునియరిగెన్

క॥ అంతట దశరథపతి య
భ్యంతరమందిరమునొచ్చి యాగోదంతం
బంతయు గులకాంతలకున్
సంతసమందగఁ దెల్పె సరసవిభోక్తిన్

క॥ పిమ్మట సరయూతటమం
దిమ్మహిరాధ్వరముసేయ ననువగునమునన్
యిమ్ముగను యాగశాలల
నమ్మునివర్యుండొనర్ప నాజ్ఞనొసంగెన్

క॥ ఆసవనశాలయంతయు
భాసిల్లె సమస్తవస్తువాయము జేలన్
భూసురవనితాతతితో
వాసిగనృప పత్ని మిత్రి వందిజనముతోన్

క॥ అందబై వెలసెడి ముఖ
మందిరమున మనుజవరుఁడు మంగళరవముల్
విందుగనెలగగ శుభదిన
మందుఁ బ్రవేశంబుసేసె నాప్తగణముతోన్

క॥ సకలామోదంబుగ న
య్యకలంకుఁడు యాగశాలయందు వసిష్ఠున్
సుకరుని ఋశ్యశృంగుని
బ్రకటితముగఁ బూజచేసి ప్రారంభించెన్

క॥ విధివంతముగను సవనము
ప్రధితంబై వెలయ విప్రబహుళాహుతులన్
అధికజ్వాలల ననలుఁడు
బుధనుతుఁడై ఘోరతేజమున జెంపొందెన్

క॥ దశరథ ఋత్విక్కులచే
భృశభక్తిం బిల్వఁబడిన బృందారకులున్
దశవదను బాధలెల్లను
విశదముగ విరించిఁగూడి వినిపించునెడన్

క॥ వారిజనాభుఁడు శ్రీహరి
వారికిఁబొడసూప నపుడవారింభక్తిన్
వారలు సన్నుతులు సమ
సారస్యమ్ములొనర్చి పంక్తికంఠునిబాధల్

క॥ వినిపించిన వైకుంఠుఁడు
విని తలపంకించి యెక్క వినుఁడీ యుపాయన్
వనజజువరమున దనుజుఁడు
ఘనకల్మషమాచరించెఁ గర్విష్ఠుఁడై

క॥ నేనీదనుజునిఁదునుమఁగ
భూనాథునిగర్భమందుఁ బుట్టెదఁ బ్రీతిన్
మానవుఁడనగుచు మీరు ని
దానం బొకయింతఁదాల్పఁదగుఁ బ్రియమునన్

క॥ అనిపల్కి తిరోహితుఁడై
చనుదెంచిరి వారు సవనసంస్థలికి రాఁగన్
అనలజ్వాలల నాహుతు
లనయము పాయసము వెట్ట పంచజ్వాలుఁడై

క॥ వరపాయసపాత్రంబును
గరములధరియించి యొక్కఁఘను డతికరుణన్
నరపతినిఁబిల్చి సీకుల
తరుణులకిమ్మంచు మఱియుఁదగనిట్లనియెన్

క॥ నలువురుతనయులునీకుం
జెలువుగఁగల్గుదురు దీనసిద్ధము నృపతీ!
విలసితమగు దివ్యాన్నము
వెలయును దైవాజ్ఞదీనివిధమిది కొమ్మా

క॥ వినయము గుతుకము సంభ్రమ
మును ముప్పిరిపడినమనము ముందుకుఁద్రోయన్
జనపతి యంజలిఁగీలిం
చి కరయుగ్మమును సాచెఁజెందినభక్తిన్

క॥ పరిదుఁడయి వేదపురుషుఁడుఁ
జిఱునగవున నృపతిఁగనుచుఁ జేతులఁబెట్టెన్
పరమార్థపాయసాన్విత
వరపాత్రను సంతఁబుష్పవర్షముఁగురిసెన్

క॥ అంచయు నీయుత్సవమును
సంతసంబుగఁ జూచి పొగడి యానందాశ్రుల్
చిందుపరంపరఁ గురియగ
బృందారకనుతు డదృశ్యవేషమునొందెన్

క॥ అంతట మతిమంతుఁడు భూ
కాంతుఁడు దశరథుఁడు దనదుకాంతలకునొగిన్
చింతతలబ్ధ్ధారమును
స్వాంతత నొసగంగఁదలచి భాగములొసరన్

క॥ సగమున్ సిగముతో సగమును
సగమందలి సగముఁజేసి సతులకునిచ్చెన్
మిగిలినదాని సుమిత్రకు
జగతీపతి యదికనిచ్చె సాదరమతితోన్

క॥ వారలుఁ బానముఁజేసిన
వారంబులు నెలలుగడువ భారములయ్యెన్
వారలగర్భంబుల నుర
వారాధిపుఁడుఁ ప్రీతి వాసముసేయన్

క॥ మధుమాసపుశుక్ల నవమిని
బుధవాసర మదితిబుక్ష పూర్ణోచ్చములం
బ్రధితగ్రహ పంచకమున్
బుధనుత! కర్కాటకరాశిఁబుణ్యాహమునన్

క॥ కోసలనృపసుత సుతుఁగనె
వాసవనిభుఁ గేకయాత్మ జాత్మజుఁగాంచెన్
భాసుర పుణ్యఫలంబున
నాసుదతి సుమిత్రవడసె నహ్నక్రమతన్

క॥ రాజిత ధనధాన్యంబులు
భోజనములు వస్త్రములును బొందుగనిచ్చెన్
భూజనముల కవ్వారిగ
నాజిమనంబలరి సుతులనందినకతనన్

క॥ ఈరీతి సుతచతుష్టయ
మారాజవరుండు గాంచియధికప్రీతిన్
వారికి సర్వారిష్టని
వారణముగ జాతకర్మ వాసకఁజేసెన్

క॥ వెలయగ శిశురత్నంబుల
లలితుల శ్రీరామ భరత లక్ష్మణ శత్రు
ఘ్నులనన్ వ్యవహారాహ్వయ
ముల నామకరణముకొప్ప భూపతిఁ జేసెన్

క॥ దినదినముఁ గువలయాప్తుని
యనువున నారాజసుతులు సతులప్రభలన్
ఘనవృద్ధి నొందుచుండిరి
కనువారి కఖండకౌతుకశ్రీఁ దనరన్

క॥ నిగమోక్తవిధుల నుతులకు
జగతీశవరుం డొనర్చె చౌలోపనయనం
బగణిత వైభవమమరఁగ
జగతీనుతపరులు మిగులసమ్మదమందన్

క॥ గురునొద్దఁ జదివి వెలసిరి
విరివిగ నర్థములఁదోడ వేదనిచయమున్
వరరథగజహరులెక్కియుఁ
దురమునఁ బరవీరపతులఁ ద్రుంచి జయింపన్

క॥ రాజిత రుచి శక్తి మతిన్
రాజ కుమారులను మఱియు రాజకుమారున్
రాజకుమారులు మీరిరి
రాజును సంతోషసలిలరాశినిఁ దేలన్

క॥ అంతట నొకదివసంబున
సంతసమున రాజు నిండుసభయందుండన్
అంతకసముఁడగు మునిజన
కాంతుఁడుం గౌశికుడు రాజుకడకరుదెంచెన్

క॥ పూజించి సేమమడిగిన
యాజింగని మౌనిపల్కె యనఘ మదీయం
బౌజన్న మఖరక్షార్థవ
తేజంబున దర్మచంద్రదీధితి నొప్పెన్

క॥ వినుమంతరాయమొదవెను
దనుజులమర్దించి మఖముఁ దగరక్షింపన్
మనుజాధిప భవదాత్మజు
ననఘుని శ్రీరామచంద్రు ననుపుము నాతోన్

క॥ అనవిని హృదయముఝల్లన
జనపతి యిట్లనియె మౌనిచంద్రమ! నన్నీ
యనువున బరీక్షసేయగ
ననియెదవనితలతు లేక యన్యమొభ్రమయో।

క॥ రాముడె నాప్రాణంబౌ
రాముడె ధర్మార్థఫలము రాముడె తపమున్
రాముడె పరమపదంబును
రామునిఁబంపుటకు నంతరంగముఁగుందున్

క॥ నేవచ్చి దనుజసముదయ
కావరమడగించి క్రతువుఁగాచెద ననినన్
భూవల్లభుఁగని కౌశికు
డీవిధమునఁబల్కె రోషహృదయస్ఫురణన్

క॥ శతయాగఫలమునొసగె స
హితుడగుఁ గౌశికునకప్పు డినకులుఁడుదయన్
ధృతియాగమొందు నోమత
హితుడగు గౌశికునిమాట నినకులుఁడదయన్

క॥ తనయుని నింటనెయుంచుము
ఘనమహనీయాస్త్రసమితిఁగానక రిపులం
జెనకక కఠోరధనువు
ల్దునుమక శార్ద్రిక్కఁక శుభదారుగ నృపతీ!

క॥ అనిలేచి నిప్పులురకెడి
కనుగవ వీక్షించి రాజుకంపముఁబొందన్
మునికులతిలకుం డరిగెను
జనులెల్లఁ గృతాంతభీతి సంక్షోభింపన్

క॥ అదిగని వసిష్ఠమౌనియుఁ
హృదయస్థితభయముమాపి యుర్వీశునితోఁ
సదమలమంగళమొదవును
గదలింపుము సుతుని నిపుడ గాధిజుతోడన్

క॥ అనవిని రాముని లక్ష్మణు
ననఘుల సర్కేందుసముల నాత్మజులనొగిన్
యనువుగనంపెను జనపతి
మునిపతి కనలుడిగి మోదమున గొనియాడన్

క॥ పరమశివువెనుక గణపతి
శరజన్ముఁడుఁ జనెడులీల శరచాపములన్
కరములఁదాలిచి నృపసుతు
లరుదుగఁ గౌశికునివెంటనరిగిరి వరుసన్

క॥ సురదుందుభి నినదంబులు
విరివానలజల్లు లపుడు విరివిగఁగనుచున్
వరభావికాలశుభముల
స్ఫింపుని మదిఁదలచి సంతసించెను బతియున్

క॥ బలయును నతిబలయును వి
ద్యలు శ్రమభయంకరములు సద్వ్రశమహిమం
బులు నుపదేశంబొనరిచె
నలఘుమతిం గౌశికుం డనాగతవిదుడై

క॥ తనవెంట రాములక్ష్మణు
లనఘులుఁ జనుదేర వారికటనటఁగల త
ద్వనముల యాశ్రమకథలను
వినిపించుచుఁ బోవుచుండె వింతలుఁగలుగన్

క॥ అటఁజని వారలుఁగాంచిరి
పటుతర ఘనదాట్టహాస భాసురగర్జా
ర్భట పటులాకృతి భ్రుకుటీ
తట నటనవికటనిటలను తాటకయక్షిన్

క॥ విశ్వామిత్రునిపనుపున
విశ్వామిత్రను మహోగ్ర విఘ్నక్రతుఘ్నన్
విశ్వంబునంతసిల స
ప్రాశ్వకులుం డపుడుఁ దాటకాహ్వయఁగూల్చెన్

క॥ అదిగని సురచోదితుడై
పదిలంబుగ జృంభకాది బహుశాస్త్రములన్
ముదమున రామునకిచ్చెను
కదనమున నజేయపదవిఁ గ్రాలగమునియున్

క॥ అంతట మునిసందోహము
వంతలుడిగి యెదురువచ్చి వారిక వీరిఁ—
సంతసమునఁ బూజించి త
దంతికమున నొప్పు కౌశికాశ్రమమునకున్

క॥ కొనియాడఁ బూజనుచేరగ
మునివరసంఘములఁ దనదుముంగలఁ బతినం
దనులు వెనుకనడువగ న
మ్మునివరుఁడు విధూతదీనముఖుడై చేరెన్

క॥ అంతట సుర మునికోటులు
సంతసిలన్ రాజవరులు సన్నుతులిడగన్
చింతితయధ్వరము నిర
ఖ్యంతరమౌనముచు మునిజనాగ్రణిఁ దలచెన్

క॥ బోయన జన్నము జరుగగ
మారీచసుబాహునామ మదసుంరిపుడు
ర్వారముఁ గవిసిన ఋత్వి
గ్భాంఛంబుగ రాముడుగ్రపావకసముడై

క॥ దీపిత మనుజాస్త్రంబున
మారీచునినబ్ధిఁద్రోసి మదమునఁబై పై
మారసుబాహుని తద్ధిత
వారంబులఁగూల్చి యనుజవరునితో వెలసెన్

క॥ మునిసంఘంబులుఁ గౌశికు
డిసకులులంజుట్టుముట్టి యెంతయుమోదం
బునదీవించిరి యక్షతు
లని తోషించిరి నుతించిరధికప్రీతిన్

క॥ సవనము యథోక్తవిధిఁజన
నవభృధస్నానంబొనర్చి యమ్మునిరామున్
రవికులతిలకునిఁ బలికెను
సవినయగంభీరమధుర సారవచనముల్

క॥ క్రతురక్షణమొనరిచి నన్
క్షితినిఁ గృతార్థతను వెలయఁజేసితి మిథిలా
పతిక్రతువుఁ గాంచఁబోదము
యతులాధిక శౌర్యనిర్జితారాతిచయా!

క॥ విని సుస్మితవదనుండై
మునివరునకుమ్రొక్కి సకలమునులు నుతింపన్
మనుకులులు జనకునవనముఁ
గనువేడుకనొప్పి యంతఁ గొంపడుఁ దగన్

క॥ మునిసంఘపరివృతుడై
వనజాక్షుఁడు రాము డగ్రభాగము నడువన్
కనికనుసంబుల మునిపతిఁ
గనుశుభముంచెదనుదలచి కదలెన్ మునియున్

క॥ వారలుఁజనుచుండినపుడ
దారింబడియున్నబండ దశరథసుతుపై
మారుతముసోక వింతగ
మారమణీరూపవిజిత మానినియయ్యెన్

క॥ అందఱు నివ్వెరఁజెందగ
సందర్భముఁదెలియఁదెల్ప సంయమివరు డీ
సుందరి గౌతమసతి సం
క్రందనుహేతువున శాపకలితగనయ్యెన్

క॥ శ్రీరామునిచరణమున
వారిజదళనేత్రి కలుషవారితయయ్యెన్
భూరిదయానిధియగు నీ
వీడనికిన్ మాత్రికలదె సృష్టిస్థలిలోన్

క॥ ఆమౌని సన్నుతిసేసి తరు
ణీమణియుచిరాద్వధూటి నిస్తులగుణయో
ద్ధాము విమలాభాసుని శ్రీ
రాముని నుతియించెఁ బ్రీతిస మార్గములన్

క॥ నీపాదరజము మూసుక
శాపోపలగాత్ర తాపశమనముఁ జేసెన్
నాపాలిదెవుడవు నీ
ప్రాపున విఖ్యాత లోకపావననైతిన్

క॥ అనిపలుగొని శ్రీరాముని
వినయమున ననుజ్ఞవేడి వెడలు నహల్యా
వనజాక్షిఁ బూడ గౌతమ
ముని యాగమనంబుఁజేసె ముదితహృదయుడై

క॥ వచ్చిన సచ్చరితునిఁగని
హెచ్చినకౌతుకము మెఱయ నినకులులు మునుల్
అచ్చపుభక్తి సెలంగ వి
యచ్చరవయ మెదను మెచ్చ నర్చించిరొగిన్

క॥ అంతట నిజేశుపదముల
కెంతయు సద్భక్తి మ్రొక్కి యిట్లను బతితో
నింతి నితాంతదయానిధి
సంశ్రితపారిజాత శరణు మహాత్మా!

క॥ అనమౌని కనికరమున సతిఁ
గని' కరమునఁ గరముఁ గూర్చి కర మొప్పగ నీ
దినమణికులతిలకుని రా
ముని చరణాపరాగగర్భమున జనివగుటన్

క॥ ప్రకటిత పూతచరిత్రవు
సకలంకవు నై తివింకననియమ్ముని రా
జకుమారులఁ గీర్తించుచు
ముకుంరాననఁ గూడి యేగె మునులనుతింపన్

క॥ అంతట మునిబృందం బిడి
యంతయుఁ దిలకించి రామునంతికమునకున్
వింతఁదళు కొత్త పేఁజని
సంతసమునఁ బల్కిరిట్లు సమ్మతసూక్తుల్

క॥ మునిజన కంటకఁ గూల్చితి
ముని సవనముఁగాచి తమృతభుగ్గణమొప్పన్
మునిసతిని నుద్ధరించితి
మునికైరవ సోమ! రామ! భూపలలామా!

క॥ ఇటుఁ బొగడుచు జనకకుభృ
త్పుటభేదన నరణిఁబట్టి పోవుచునుండన్
యటవీగమన శ్రాంతికి
నట జటిలోటజ సువార్త లానందముగన్

క॥ వినిపించుచు మనుకులులకు
మునివర్యుఁడు కౌశికసుతుఁడు ముందుగనడువన్
వినికని తనియుచు వెంటనఁ
జనుచుండిరి రాజసుతు లచంచల పథులై

క॥ చనిచని కాంచిరి బుధజన
వినుతంబై శక్రనగర విభవవిజితమై
ఘన యోధవీర భట గణ
వనపంక్తులఁగరుల హయుల బలసిన మిథిలన్

క॥ కనిచొచ్చి నగరవైభవ
మును జూచుచుఁ బోవుచున్నమునులకు నెదురై
చనుదెంచి జనకజనపతి
వినయంబునఁ బూజసేసె వివిధ స్తుతులన్

క॥ అంతట మునిపతి ధరణీ
కాంతునిఁ గరుణార్ద్రదృష్టిఁ గనుగొని నృపతీ!
సంతసమె నీకు హితసా
మంతులకున్ బంధువుల కమాత్యజనులకున్

క॥ నావిని జనకుండిట్లను
తావక దర్శనము సకలధన్యత్వంబున్
గావించెఁ గొఱతకలదే!
భావి శుభప్రాప్తకాల భాగ్యోదయమై

క॥ అనిపల్కి మౌని మండల
మునకు న్వందనముఁజేసి ముదిత హృదయుడై
వినయాన్వితుడై మందిర
మునకుం దోడ్కొనుచుఁజనియె మునులనృపజులన్

క॥ అందఱ నుచితాసనములఁ
బొందుగఁ గూర్చుండఁజేసి పొలుపుగ మునిసం
క్రందను నిట్లను జనపతి
సుందరు లీ బాలు రెవరిసుతులు మహాత్మా!

క॥ నావిని కౌశికమునివరు
డీవిధమునఁబల్కె జనకనృపతీ! యనఘా!
దీవిభవుడైన దశరథ
భూవల యాధీశుని యాత్మపుత్రులు వీరల్

క॥ శ్రీరాముడు లక్ష్మణుడన
వీరలనామములు మఱియు వీరిలో జ్యేష్ఠుం
డీరాముడు వీరాగ్రణి
సారబలుండనగ నెగడు సత్యవ్రతుడై

క॥ రక్కసిమేటులఁ బెక్కుర
జక్కాడచి మదధ్వరంబు సంరక్షించెన్
ఘుక్కంటివిల్లుఁ గనుగొన
నిక్కడ కేతెంచిరిపుడు నినకులతిలకుల్

క॥ ఇనకులులని విని కనుగొన
జనకుని కన్గవ విశాలసంస్థితి నొందెన్
ముని ధనువుఁ బేర్కొనంగను
దనమన ముప్పొంగి బాష్పధారలు గురిసెన్

క॥ ఈ మహనీయుడు సులభుడె
మామకజామాతయగుట వారివిధానం
బేమేమి తపముసల్పెనొ
యామహిత తపంబులేక నందగవశమే

క॥ శ్రీరామా హృత్పంజర
కీరంబై వెలయు చక్రి కిల్బిషమెల్లన్
వారించి శూలిధనువును
శ్రీరాముఁడు నెక్కుపెట్టఁజేయుం గాతన్

క॥ అనితలచి శరభసముల
ననుపమ బలయుతుల సంప నధికక్రమలన్
గొనితెచ్చిరి భవుధనువును
ననిశము బూజితసుమాళి నలరెడుదానిన్

క॥ అంతటఁ బురమున నాలుగు
చెంతలఁ గోలాహలంబుఁ జేయుచు జనముల్
వింతలుఁ గన జనుదెంచిరి
సంతసమున రాజసభకు సత్వరగతులై

క॥ విల్లెక్కుఁబెట్టునట ఘా
వల్లభుని కుమారుడంట వలరాజును దా
నొల్లడట రూపసంపదఁ
విల్లుండట చూడ వానిపెంపదియేమో!

క॥ ఈరీతి రాకుమారులు
హోరాహోరిగనుబోరి రొంపక విల్లున్
తేలయినఁ జూడనోపక
పాఱిరి వీడెట్లుజేయఁ బాల్పడునో గద!

క॥ ఇతడైన జనకపతి వాం
ఛితమును సమకూర్చెనేని క్షితితలమందున్
ప్రతిలేక వెలుగుచుండును
పతిసత్యవ్రతము నేడు ఫలితముగొందున్

క॥ అని పౌరజానపదుల
జనితకలము సలిపుఁ గ్రమ్మె సభనెల్లెడలన్
మనమున హర్షంబెసగగ
వినుపుత నందఋనుజేతి రాయాయెడలన్

క॥ రాజులు రాజకుమారులు
రాజద్వేషముననరి రాజసమొప్పన్
తేజోధికులై వచ్చిరి
రాజసభను సన్నుతించ బూరిపెఘలన్

క॥ భాసుర చకోర నేత్రలు
నాసన్నసుధావిరాజి తాంతఃపురమం
దాసీనలైరి ముదమున
వాసవనిభు రాముఁ జంద్రవదనుం గనుచున్

క॥ నీలాలక భూబాలిక
శ్రీలీలన్ చెలగుచెల్వ స్మేరాస్యముతోన్
బాలేందుఫాల సుగుణా
వాల సరోజాక్షి సీత వారలనడుమన్

క॥ తనుఁజెలులుఁగొలువ వాతా
యనమార్గంబున నగపడు నలనుసుహృన్
మునిగణసంయుతు రాముని
నినవంశునిఁబూజసేసె దృగ్జ్ఞలినములన్

క॥ జనపదపురజనములతో
మునివరగణ రాజరాజ పుత్రులతోడన్
ఘనతరవైభవములతో
జనకునినభయొప్పె మఘవుసభకైనయశ్రీ

క॥ సమయవిదుండగు నాసం
యమిపతిఁగనిపల్కెనింకనాలోచనయే
ల మహాభృచ్చాపునిచా
పము, నెక్కిడు నుల్సవంబుఁ బాలించుటకు

క॥ ఆనవిని వినయాన్వితుడై
ధనువునుబూజించి విధిహాంయుగ రా ...
వనఁబల్కె జనకజనపతి
వినువారికి విందు ధీతి వెలుతవొంటన్

క॥ ధను వెక్కుఁబెట్టఁగలిగెడి
జనపాలకవరుఁడు జనకజామాతయగున్
ధనువెక్కుఁబెట్టఁజాలని
జనవరమండలికి జనకజా మాతయగున్

క॥ పతిబల్కి వాక్యరవము నృ
పతిభోగిశ్రవణ రంధ్రభాగముఁ జొరగన్
ధృతిఁదూలి వక్రగములై
యతిదీనంబడర బ్రతుకనరిగిరి పెలుచన్

క॥ కొందఱుఁదెంపువహించిరి
కొందఱుదరిఁజేరి కొంచి గొంకిరితమలోఁ
గొందఱు గుసగుసలాడిరి
కొందఱు నిరపేక్షసూక్తిఁగొనిరి యవలతన్

క॥ అందఱ చందముగని పతి
సుందరు మునిబృందసంస్తుశోభితు రామున్
డెందంబలరగఁగని యా
నందముమదిఁబొందఁ దపసినాథునిఁ గాంచెన్

క॥ ఆంతయుఁ దెలిసినముని తన
యంతికముననున్న దశరథాత్మజు రామున్
కంతుజితరూపుఁ గనుగొని
కంతుజితశరాసనంబుఁ గంటివె వత్సా!

క॥ ధనుఖిదుదర్శనము మే
దినిభృన్నివహమును పీతధీరులఁజేసెన్
వెనుకైరి వార లింతకుఁ
జనుదురె నీవాకడుఁదక్క శతమన్యునిభా!

క॥ తెమ్మా తడయకు శుభమగు
గొమ్మా యీయుగ్రధనువుఁ గుతుకంబెసగన్
తెమ్మా చిరతరకీర్తిని
నిమ్మా సమ్మదము మాకు నినకులతిలకా!

క॥ అనిబలంకుమునికి వందన
మొనరించి శ్రీరాము డాత్మనొప్పుగ జనసీ
జనకులను సంస్మరింపుచుఁ
జనె మదగజగమనలీల చాపస్థలికిన్

క॥ వెలయఁజిఱునవ్వు మోమున
వలనుగఁజని ధనువుఁగాంచి వసుధాధిపతుల్
చులుకనఁదనుఁగనఁగనుచున్
వలువను మొలనమంబిగిచి ప్రత్యావీఢన్

క॥ రఘుకులు డుగ్రధనుస్సును
లఘులీలన్ గుణముఁగూర్చి లావుగలాగన్
మఘవుకరి చెఱకుతుంటను
లఘుగతిమెఱయంగవిఱుచులాగున విఱిగెన్

క॥ ధరఁగదిలె నొఱగెగిరులును
సురపతిమూర్ఛిల్లె నుదధి యూగెదిగ్గిభముల్
దరగదిలె లోకమంతయు
హరధనువునువిఱువ రఘువరాగ్రణిపెలుచన్

క॥ ఆరావము విలయాంబుద
ఘోరరవమ్మనుకరింప గుండియలవియన్
చేరగిలనొరగి రాసన
వారము లాధారమగుచు వసుధాదీశుల్

క॥ ఆరావము జనకుని హృద
యారామశుకస్వనంబు ననుపై చెలగన్
ఆరావము సీతాముఁత్రేప్ప
రితమై వీనుగవకు విందొనఁగూర్చెన్

క॥ రుచిరస్మితరుచి నిచయా
విచలిత జిత చంద్రబింబవిధమై యొప్పన్
సుచరిత్రులు రఘురాముని
నవలాలోకనసుమాళి నర్చించిరొగిన్

క॥ కని పతి ముదమునఁ జనియా
జనపతిపసుతుని రామచంద్రునిఁ బ్రియమున్
వినయముఁ జెనగొన నిట్లనెఁ
గనుగవ నానందబాష్పకణములుఁ దొరగన్

కి॥ మనసున కగోచరము త్వ
ద్ఘనతేజ మమోఘ మప్రధర్ష్య మచింత్యం
బనివార్య మనిర్వాచ్యం
బనిమిషపుంగవునికైన నలవియె పొగడన్

క॥ విను "వీర్యశుల్క" యనినా
తనయవివాహమునుగూర్చి ధారుణిజనముల్
వినఁబలికిన నాప్రతినం
బనఘ భవత్కృపను సఫలమయ్యెను నిపుడన్

క॥ అనిమౌనిఁ జూచి దశరథ
జనపతి కీశుభప్రవృత్తి జవగతిఁ జని నా
మనవినొనర్ప నయోధ్యకు
బనిచెద మద్బంధువృద్ధవరుల సచివులన్

క॥ అనిబల్కు జనకుసుధురో
క్తి నిచిని జనకునిఁగనంగ దివ్యనమయమిం
దొనఁగూడెననుమ మనముల
ఘనకౌతుకవంతులై రి కాకుత్స్థవరుల్

క॥ జనకుని పల్కులువిని తమ
కనువగుమార్గములఁజనిరి యవనీశతులన్
మనుకులుల హనుల హితులన్
ఘనకౌతుకదృష్టిఁబఱపి కఱు కుతుకమునన్

క॥ అంతటను జనకజనపతి
సంతసమందుచును బెండ్లిఁజాటం బంచెన్
వింతఁదఱకొత్త ప్రజలకు
వంతలుడిగి వారలెల్ల వచ్చిరిసభకున్

క॥ జనకుని పనుపుననరిగిన
ఘనభటులు నయోధ్యకేగి కాకుత్స్థుని పెం
డ్లినకులతిలకున కంతయు
వినిపించిరి వేడ్కలొదన విగతశ్రములై

క॥ మఱియును వారివలన సొం
పెఱయంగా తాటకాది భీమాసురులన్
కఱకుశరములను జదిపిన
నెఱతత్తద్గాధలన్ని నేర్పునవినగన్

క॥ కని పౌరజానపదులను
ఘనమంత్రుల హితుల సుతుల గాటపుఁబ్రేమన్
మనమునఁదలచినవారల
జనకునిప్రోలునకునంపె సన్ముదలీలన్

క॥ కాంచనరుచి నొప్పారుచు
నంచితముగ రత్నఖచితమై యొప్పెడి య
త్కాంచన రథంబు నెక్కియు
బంచద్వయరథుఁడు వోయె బహుబలయుతుఁడై

క॥ దశరథపృథివీపతినిఁ గని
భృశభక్తి నమస్కరించి ప్రేమాన్వితుఁడై
దశరథునిసఖుఁడు జనకుడు
విశదంబుగ నెదురువచ్చె వీతాఘుండై

క॥ అందఱు మునులును శిష్యుల
నందఱతోఁగూడివచ్చి రవలకువేడ్కన్
క్రందుగ వీతెంచెను శుభ
మందంగ సుమంగళాది ధ్వను లవుడవటన్

క॥ సురుచిర తోరణయుతమై
విరివిగఁ జెన్నలరునట్టి వివిధపుఁజేతల్
వరమఘవు సభకు నీడుగ
బరిచారికపరిహౌనర్చి రతిఖానుపలన్

క॥ ఉత్తరఫల్గుని గూడిన
యుత్తమదివసంబు మిగులయోగ్యంబని ర
మ్యుత్తమ మునివరులందఱుఁ
జిత్తములందలంచి పెండ్లిసేయగ నవుడున్

క॥ ఘనుడు వసిష్ఠుడు మఱియును
ఘనుడు శతానందు డపుడు మనమునగుపదిసన్
మనమున ముదమొదవంగా
వినిపించిరి వంశజుల వీర్యగుణములన్

ఆ॥ భాసుర కేసరులంచయు
భాసురముగ వేదఘుష్పపరనము సేయన్
వాసికినెక్కిన రమణులు
నాసమయంబునను బల్కులాడిరి లీలన్

క॥ రాముని నొకపీఠంబునఁ
ప్రేమున్నివసింపఁజేసి వేదికలోనన్
భామామణులలో మణియగు
రామప్రియ సీత నప్పుడలంకృతి నెసగన్

క॥ శుభలగ్నంబగు సమయము
విభవంబుగరాగ నపుడు వినయస్మితుడై
యిభరాజగమనకంఠము
శుభమాంగల్యంబుచేత శోభగఁజేసెన్

క॥ భరతునకును లక్ష్మణునకుఁ
వరశత్రుఘ్నునకు నపుడవారితశోభన్
వరుసగ మాండవి యూర్మిళ
మఱియును శ్రుతకీర్తి నపుడు మానుగనొసగెన్

క॥ నలుగురు బలికిరి ధరనా
నలుగురుసోదరులఁగరము నవ్యస్ఫురణన్
నలుగురుఁబలికిరి ధవలో
సలలిత మతి దాన వహన శాంతుల కెనయన్

క॥ పూతచరిత్రుఁడు జనకుడు
చేతోమోదంబుతోడ శ్రీఘ్రముఁగాగన్
నీతిపథంబున సుతలకు
నాతతముగ సైన్యమాది యరణములిచ్చెన్

క॥ నాపేరు రాముఁ డందురుఁ
భూపాలకగర్వహారిఁ బుధనుతశీలా।
కోపింపక మీచరితము
నేపారఁగఁ దెల్పు మిఁక ననిందితచరితా।

క॥ అని రామవిభుఁడు సెప్పిన
సునయోక్తుల కాత్మ నలరి చూడీవిల్లున్
ధనువు బలముఁ గనుఁగొనుమని
యినవంశుని నాజ్ఞసేసె నింపుగ నపుడున్

క॥ శ్రీరాము డతనివింటిని
గోరికతోఁ జేతఁ దీసికొనువంతకా న
స్సారంబయ్యెను నదియు
న్నారాముని సత్త్వమెల్ల నాకర్షింపన్

క॥ కని రాముఁడు రాముని నతి
ఘనమోదముతోడ నిట్లుఁ గనుగొని ప్రేమన్
ఇనకులజలనిధిచంద్రమ
విను నీ ఘనజన్మమింక వృద్ధిఁ గాంచున్

క॥ మదమునఁ గదలిన రక్కసి
కదుపులఁ బెక్కులను నీవు కదనమురోఁసన్
మదమణచి త్రుంచి వైరుల
విదితంబుగఁ గొంకుంటు ప్రేరేపింపన్

క॥ అని భృగుకులనిధిముఖ్యుఁడు
వినయంబున రఘుకులాబ్ధివిధుని కెఱఁగి మఱి వీ
డ్కొని వెస హిమగిరి కరిగెను
కనుఁగవ నానందబాష్పకణములు రాలన్

క॥ అంతట రఘురాముఁడుఁదన
యంతికమునమున్న ప్రజలనడిగి రయమునన్
సంతోషితుఁడై నిజశ్రీ
మంతంబగుఁ బురమునొచ్చె భటనివహముతోన్

క॥ వచ్చిన సచ్చరితునిఁగని
హెచ్చినకౌతుకముతోడ నినకులవరుపై
ముచ్చటలుఁదీర పౌరులు
నెచ్చెలులును గుసుమవర్షనివహముతోడన్

క॥ పూజించి సేమమడిగిరి
భూజననందితునిమిగుల భూసుతఁబ్రీతిన్
సౌజన్యధనుఁడు రాముఁడు
తేజముతోఁజెప్పెఁ దనదు తీయనిగాథల్

క॥ ఈరీతి సుగుణచరితుఁడు
శ్రీరమణింబెండ్లియాడి చెన్నొందుచు వి
స్ఫారిత బహుసుఖలీలన్
వారమ్ములు నెలలుగడువవచ్చెనునంతన్

"బాలకాండము—సంపూర్ణము"

# అ యో ధ్యా కాం డ ము



చ॥ శ్రీరఘురాముని న్విమలశీతమయూఖునిఁగేరు నెమ్మొగం
బారమణీయమై కలుగువాని దినేశ్వరిసూను నంగదు
న్నారసి బ్రోచి ముఖ్యకపినాథులకెల్లను దోడునీడయై
పేరిమిఁగన్నయట్టి రఘువీరుని నెప్డు భజింతు నామదిన్

ఉ॥ అప్పుడుఁబెద్దవాడగుచు నన్నిపనుల్వ్వెనఁజేయలేక యా
గొప్పదియైన రాజ్యమునకు న్ఘనునెవ్వని రాజుఁజేసెదన్
ముప్పునఁగాలకింకరులు మూఁగకమున్న రయంబున న్ఘనుల్
యొప్పుగఁజెప్పరయ్య సుగుణోన్నతులార! కృపాగరిష్ఠులై

ఉ॥ ఇట్టిప్రశస్తశేముషివిశేషపుఁబల్కులు మౌనులందఱున్
గట్టిమనంబుతోడవిని కాయజసన్నిభు శ్రీరఘూత్తమున్
పట్టముఁగట్టుమంచు నతిప్రార్థితులై తెలియంగఁజెప్ప న
ప్పట్టునవచ్చె దాశరధి ప్రస్ఫుటవేగపదారవిందుడై

॥ వచ్చినరాజనందను నవారితవాక్కుసుమాళితోడ నే
ర్పచ్చుపడంగ దీవనలుబాగుగఁజేసి ప్రసన్నచిత్తులై
మచ్చటఁగొల్చుచున్న రఘుపుంగవుతో జనకుండు నిన్ను నే
మచ్చటికంబులేక యువపట్టముఁగట్టఁదలంచె నావుడున్

॥ రాజను నేకువేడుదుఁదిపంబుగ నేను భయంబుతోడుపన్
మోజులందీఅమ్రొక్కెద నమోఘవదన్యుఁడనై వచించెదన్
భ్రాజితమైన రాజ్యమనభారము నాకుఁగనంగ దుఃఖమౌ
నోజననాథ! నేను విముఖుండను దానికిఁబ్రస్తుతంబునన్

ఉ॥ నావుడు రాజచంద్రుడును నావిధమంతయు గుర్తెఱింగి మే
ధావియు బ్రహ్మ క్షత్రసుతుడై న వసిష్ఠుని బిల్వనంపి సిం
ధావిరళప్రరుహవాక్యముల నద్దరిఁజెప్పి వదంచి రాముసిన్
వావిరిఁదోడ్తెగిం ఋ పట్టాభి షేకంతయు సంధించుచుగిన్

ఉ॥ రాజిత ముఖ్యవస్తునికరంబులచే నగనించుయిన్ మునుగో
ద్ర్వాభితరోరజాది ఘనపల్లవ నాను ఫల ప్రవీర్తిచే
ఘీజనసంచవీయమయి సొంపుగనుండె సమోహ్వయంబు
రాజులదోస మేటియగు రాముని పట్టముకోల్ప వంబునన్

ఉ॥ అక్కడఁ కోలు వన్గవుడు ఉక్కని స్వప్న సుదంచంబు క్తి
మొక్కలుఁనోని దారూవుల మూ ఖర్వుంద్విల యుంగుగల్గి ఉ
పెక్కుచు ముగ్గంతి ర పణీయులునా మగవారిఁగూడగ
యక్కరుహాద్రి రాఘవమునాథివిగాంచిరి పేడ్కఁబూనగన్

ఉ॥ బంధులఁగూడి నవ్వులను ధానుని మిత్ర కళత్ర రోటిచే
సంధిలుచుండ నోట్క సిగాసవుయం బటుచెంచుసుండట
"మంథర"నాను వక్రలంబునిసి కైకడదాని యొఁ్నుచు
స్నంధకళ ధ్దమూ సుగుణ ఖండనుతిదను చెప్పెం గైకటున్

ఉ॥ కైకయు దానికి న్మిగులఁగర్వము ఁజెందుచు దాసికొల్లనున్
లోకప్రశ స్తసీయ ఘనసూఢ్విరట్రుడు రాముఁజెడుయున్
నాకునుజూడ మిక్కిలిగ నవ్వునుఁబుచ్చుచునున్ననిప్పు సీ
వాకొనవద్ది నర్వవిధవాక్యవరంబరి విస్ఫుటాంగ

ఉ॥ ఓసినిమూఢురాల వినుమోపిజట్టి పడీయవాక్యముల్
భాసురరత్నసంచయిర భవ్య విసూంప రోచినంగ నం
భ్రాస సురారిమూఢనికరంబునుగల్లు కిరీటవన్నెను
నీసుతునొడలన్నిడక సీదుసవల్లి జాకిచ్చినో ర్తునే

ఉ॥ కావున నీవు శీఘ్రముగఁ గాంతునియొద్దకునేగి నీకుము
న్నావిరి యుద్ధమందిడిన భవ్యప్రసాదవరద్వయంబు నే
డావిధమొప్ప వేడు ప్రకటంబుగనేడు నవీనభక్తితో
నావిభుఁడిచ్చు తప్పకను ఆతనికి స్వన్ప్రేమ నీపయిన్

ఉ॥ పంతముఁబూని వేడ్కఁ జెలిమంథర చెప్పిన వాక్యజాలమున్
సంతసమందగావిని ప్రశాంతమనఃకమలంబుఁగల్గి యా
కొంతనెయున్న భూవిభుని కొప్పగుచు న్పృహారత్నదీప్తిమ
ద్దంతిపురంబు సొచ్చె జనులందఱు విస్మయమందిచూడగన్

ఉ॥ అక్కడ రాజ్యభార జనితాకుల సంవృత చేష్టుడై విభుం
డొక్కెడ మోహమువాంచి పెనుమూగిననిద్రఁ బరుండియున్నచో
నక్కమలాక్షి కైక నిజనందను బట్టముఁగట్టుబుద్ధిచే
నొక్కసులిప్తకాలమున నొప్పుగ రాజునుమేలుకొల్పితాన్

ఉ॥ వచ్చినకార్యమంతయును బాగుగగఁజెప్పి వరద్వయంబునున్
మచ్చికతోడఁదెల్పియను మానసులేక ఘనుండు రామునిన్
అచ్చపుఁ గాననాది ఘనవాసునిగాఁ బదునాలుగేండ్లు ఏ
కొచ్చెములేక నీభరతపుత్రునిఁ బట్టముఁగట్టుమంచనన్

ఉ॥ ఓ కఠినాత్మురాల! వినుమోపికఁబట్టి మదీయవాక్యముల్
నాకుమనంబుఁగల్గునె జనాధిపసూను నరణ్యభూమికిన్
ప్రాకటమొప్పఁబంపగను బట్టణపౌరులకిష్టమౌనె నీ
వాకొనునట్టికోరిక ధృవమ్ముగనీవము ఎల్లవారికిన్

ఉ॥ రాముఁడె నాకు నేడుగడ రాముఁడె సర్వఫలప్రదాతయున్
రాముఁడె నాదుజీవనము రాముడె నాకులదైవతంబు నా
రాముఁడె నాకు ముక్తిదుఁడు రామునివీడి వసింపఁజాల నో
తామరసాక్షి! రామగుణధాముని బంపగలేను గానకున్

ఉ॥ నాధుని పుత్రవత్సలత నాతనిమోహపరీతవాక్యము
ల్పాగగనుండె నామెకును అంతులకు న్ఘనవాక్కుఁబట్టునే
బోధనసేయ దుష్టునకు బుద్ధియుఁగల్గునె యంచ నామె యా
రాధిత సర్వభూషణ విలాసములన్నిఁటిఁదీసి సెల్వవన్

ఉ॥ కోపగృహంబుసొచ్చి యంగూనిది మందరతోడఁగూడి సం
తాపభయాస్పదప్రకటితంబగు కుంతటపైఁ బరుండియున్
భూపతిరాకఁగోరు చౌకమూలన నిద్రనునింగియుండె నా
పాపపురాజు మాను వరపట్టముఁగట్టదటంచు దూఱుచున్

ఉ॥ ఇట్టిది రామచంద్రపరు డెంతయువింతగ నూహఁజేయగన్
పట్టెను పంతమంచు విని మానినిఁగూడగఁజేరి యట్టులే
గట్టిచునంబుఁగల్గి యికగాటపునీకొమరున్ రయంబునన్
పట్టముఁగట్టుకొమ్మని యపార ముదంబున వచ్చిచెప్పినన్

ఉ॥ ఆసుతుఁదీయమాటలకు హర్షతరోల్లసదాననాబ్జయై
యాపతిపల్కు నట్లె విభునానతి వేగమె నీవు ఎల్లి సం
త్రాసముచేభసింహఘనదంబు సుఫేనవఘోటకాది ఘో
రాసుమహించుచోటికిఁ గరంబుగనేగుము సంతసంబునన్

ఉ॥ అంతటభర్తచెంతకు ముదంబునఁబోయి వినీతినిట్లనున్
పంతనుమాని రాముని నవారితబాహుబలాఢ్యు తప్పక
న్నంతిపురాననుంచక వనంబులనుండగఁ బంపగావలెన్
చింతల కింక కోర్కెసతి శీఘ్రవిధంబుగఁదీర్పు నాపుడున్

ఉ॥ తిన్నగలోనికేగి ఘనతీవ్రవరంబగు వంతఁగుందుచున్
యన్నవదోఁడిమంక పటియాన్మజువంక విశాలదృష్టికోఁ
గ్రన్నఁగఁ గాడ్కనిచ్చి మతిఃష్టఁబమ్కుచుఁబల్కలేక చే
సన్నల రాఁగఁబిచ్చి మతినా గ్రక్కదు ఖనసద్ధకంరుడై

సీ॥ రామగుణాభిరామ దినరాజకులాంబుధిసోమ నీరద
శ్యామ ప్రియాంబుకోదుల వెనక్కెన నీవు నరణ్యవ_ర్తివై
నీమముమీఱబోయి ఘననిష్ఠతో నీవడనాల్గులబ్దముల్
భామసుకీ ర్తి గాంచియును తండ్రియానుజ్ఞను గోలుపున్వకన్

సీ॥ ప్రేమముమీఱ నందునలతించి యతీశ్వరకోటికి స్వవ
న్నామసుకీ ర్తనాదు లనుమానసములేక పరించువారి కు
ద్దామసుఖంబులిచ్చి యతిధర్మ్యప్రబద్ధతి వీడకెన్నఁడున్
మామకపట్టణంబు (దరువాతనుజొమ్ముఁడు పేడ్కమీఱగన్

సీ॥ ఆనమయంబుగు రైతిగి యన్న ఏనొపుగనేగుదెంచె ధీ
భాసుఁడు లక్ష్మణుండును కుభ్రపదమంచును మాతయొద్దకున్
హాసవముఖాబ్జులై యరిగి యంతయుదండ నవంత దాసకన్
భాసురమొన్పఁజెప్పఁ జెనువాతహతి న్వకు వృక్షభాతిగన్

ఉ॥ లక్ష్మణుతల్లియు న్మఱియురామునితల్లియు నీవిధానమున్
సూక్ష్మముమీఱ గు రైటుగశోకభరాకులితాంతరంగలై
పక్ష్మలలందు వేడియగువాతసుఁడోలిగ నాపుఁడ వా
సూక్ష్మములై న కౌనులను జూడ్కికగోపము మై చలింపగ

ఉ॥ ఆనమయంబున న్భరతు డాతనితమ్ముఁడు పట్టణంబుసం
బాసియు మున్నుగా తనదుమామగృహంబునఁ బోయిసంబెంబున్
ఆసతి యిట్టిఘోరమగునట్టిపను ల్సొనరించెగాని యా
యాసిసుమంతలేని గుణశీలుఁడు నాభరతుంసునోర్పునే

ఉ॥ అందటనా ర్తిఁజెందిరి రయంబున సోదరులంతటు న్భవకన్
చిందరవందరై రి మునిసేనెవు రామవియోగవార్ధిలో
గుందుచు వ్రాలుచు న్పదుచుఁ గొందచుఁ బొంపిరివోయి పిట్టెసం
క్రందనసన్నిభు న్రఘువరాగ్రణి పావనవాసరకృకున్

ఉ॥ కాంచనరత్నదివ్యమణి కమ్రసువీథితులన్నివీడి ము
న్నంచితవల్కలంబులు ఘనంబుగఁదాల్చి సఖుల్కలంగగన్
నించినదుఃఖమందు జననీజనకుల్ వెతలందుచుండగ
న్నంచలవాహ శర్వ దివిజాధిపవంద్యుఁడు రాముఁడెంతయుఁ

ఉ॥ అప్పుడు రాముఁడేగుసమయంబునుజూచి భయార్తచిత్తయై
యెప్పుడు నెక్కడ న్విభుని నేచుటకన్పడియించుచుండఁదా
నప్పుడు లేచివచ్చి జనతాధిపనందన మోమువాంచగా
ముప్పిరిఁగొన్నరోషమున భూపతిసూనుఁడు రాముఁడిట్లనెన్

ఉ॥ నిండుగఁదెల్పికొంటి విను నీరజహంసలుఁగూడియుండుట
న్మంచితమైఁదనర్చు ఘనమాన్యతనొప్పు కొలంకులేద యా
వండలలోగ్ర ఖడ్గ ఏకసామజ సింహ వనంబులేద యిం
దుండుము నీవుఁదోషముననొప్పి నవాంబుజచారులోచనా!

ఉ॥ అన్నవిధంబుఁదానెఱిగి యాతనితమ్ముఁడు లక్ష్మణుండునున్
తిన్నగవచ్చి నిల్వఁబడి తియ్యనిమాటలఁ బ్రస్తుతించి య
త్యున్నతదీర్ఘమైన కరయుగ్మము ఫాలమునందిమిచ్చి సీ
తన్నవిధంబున న్తనదుయాగమనంబువచింప రాముడున్

ఉ॥ బాగుగవారిరాకకును భావమునందునఁ దోషమంది సం
యోగనిజాబల న్మఱియు నొప్పుగ లక్ష్మణుఁగూడిరాగ వే
వేగఁ బురోహితాది ఘనమిత్రులఁదోడ జనంబులోడ ను
ద్యోగవనంబుతీరును నిజోత్సుకమొప్ప వచించివెండియున్

ఉ॥ తల్లులకెల్ల మ్రొక్కి తనతండ్రికిఁ బ్రీతినమస్కరించి సం
ఫుల్లమనస్కుడై తనదుముఖ్యసుమంత్రులకెల్లఁ దెల్పినన్
ఉల్లములోనఁ జింతిలుచు నూర్పులురాగ తలంగిరందఱున్
తెల్లనఁబోయి గప్పు నగధీరుఁడు రాముఁడు నిష్క్రమింపగన్

చ॥ ఘనవరరత్న కాంచనసమన్వితమై తనరారి భక్తిమై
భూసురకోటిచే బొగడఁ బొల్పలరంబగు వాక్యసంస్తుతుల్
శ్రీపతికీడుకాదగు సుశీలచరిత్రయు సీతఁజూడఁ దే
రాను పవిత్రుడైన రఘురాముని సూతుడుఁ దెచ్చిపెట్టగన్

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును మిథిలాపతినందనతోడఁగూడి యా
రామ లతాగృహాలి విపులాంగసంయుత భాసురంబునై
భీమసమాన రాత్రిచర భీతినిఁగొల్పు అరణ్యభూమి కు
ద్దామ విధంబుఁ బోవ ఘనసర్పితులై రఘురామభక్తిచేన్

ఉ॥ ఆపురినుండి భక్తిజనసూచకమయి సేకపథంబుఁగల్గి యా
పావనుఁగైకఁ బల్కిన యహానువక్త్రపు వాక్యజాలము
న్నావగలేక రాజు వెతనందుచుఁ బాయగ దుఃఖమగ్నుఁడున్
దావముఁగల్గె మూకమునఁ దాను పరిత్యజలోకచిత్తులై

ఉ॥ వెండియు వారుఁబోక రఘువీర రథంబు పథంబుఁబట్టి యా
యండజయానలు న్వేవన యుపవంచితయాన మతిక్రమింపగన్
మండితభంగసంగను రమాధిపపాద సుజాతఁ గాంచి యు
ద్దండకరాళిమున్గి పవిత్రతటమందు వసించిరప్పుడున్

ఉ॥ అంత నయోధ్యపట్టణ ఘనప్రజలందఱు దీనభావులై
వంతనుగుంది బంధుజనవాహములన్వెసఁగూడి మొత్తమై
చింతిలుచు న్నరాధిపలనుజెందెడు రామునిఁబాయలేక వే
మంతనమాడి యాత్మఁబ్రపమార్గ సువీక్షితులైరి యందఱున్

ఉ॥ రాజకులాగ్రగణ్యుఁడు నరాతికులాటవి యగ్నిచేపుడున్
భూజనవందితుండు నతిపుణ్యసుశీలు దయోధ్యరాజుఁ దా
రాజిత జ్యేష్ఠపుత్రు రఘురామవియోగ ఘనాగ్నిఁ గ్రాగి సం
పూజనలొప్పఁ గైకొనుచుఁ బుణ్యదివంబునకేగెఁ జెచ్చెరన్

ఉ॥ పుత్రులు నల్గురుండియు నపుత్రునిమాడ్కి నొకండుచేయఁడన్
పాత్రతమీఱలేమికి సభాగ్యపు జీవితుడయ్యె రాజు ఆ
శత్రులకైన నవద్దు ఘనజన్మశతంబుల కైన నెక్కుడన్
పుత్రుని మాసతీ పడఁబు పూజ్యసురేఖలుఁ దప్పనొప్పునే

ఉ॥ పట్టణమెల్లగల్లనియె భార్యల శోకరవంబు హెచ్చె నా
చుట్టమునున్నరాజులు విశుద్ధమనస్కుల నయ్యయోధ్యను
న్నెట్టననేగుదెంచి యొకనిర్ణయమొప్ప వసిష్ఠునాజ్ఞ న
ప్పట్టునఁ గైకయాత్మజుని యాతనిఁ దమ్ముని బిల్వనంపగన్

ఉ॥ సంగతులన్ని పూర్ణముగ సారముఁదోడుగఁ దెల్పి యేపున
న్నంగముఘాతిఁ గోపమున నేత్రయుగంబునఁ గెంపుహెచ్చగన్
బొంగుచు మాటిమాటికిని బూతులుఁదిట్టుచుఁ దల్లిఁజూచి యో
యంగన! యెట్టి ఘోరవికృతాకృత కార్యముఁ జేసితివ్వుమిన్

ఉ॥ ఎవ్వరు నీకుబోధ నతితీయగఁజేసిరి చెప్పునాకు నే
నెవ్విధినైన వారిని మదీయకఠోరసుశస్త్రకోటిచేఁ
గ్రొవ్వణమాన్పి రాఘవుని కోమలపాదసరోజ యుగ్మమున్
నవ్వుచు నాశ్రయించెదను నవ్యవిధంబగు దీనదృక్కులన్

ఉ॥ పౌరులవల్ల హెచ్చగు విపన్నపువాక్యము లాలకించి సీ
తారమణీన్దలంచి గుణధాముని రాముని యాత్మనిల్పి యే
పారగ వైదికక్రియలు భాసురమొప్పగఁజేసి తండ్రికిన్
నారి యశంబుఁగూర్చె ఘనపుణ్యుఁడు నాభరతుండుఁ దమ్ముఁడున్

ఉ॥ ఇక్కడరాముఁడుం దమ వనీపములంతయు పండ్లతోటల
న్నెక్కుడు రామణీయకల నింపుచు సర్వముతు ప్రసిద్ధమై
జక్కవకోయిలాది ఘనసారస బృందమనోహరధ్వనుల్
మక్కువమీఱవిన్చు జనమాన్యులు సీతతొ సంతసంబునన్

ఉ॥ అత్తఱి లక్ష్మణుండు జనకాధిపనందన రాఘవచంద్రుఁడున్
చిత్తములోన దీనిఁగడచేరువిధంబు నుపాయమెద్ది యం
చిత్తఱి నెవ్వరిక్కడకుఁ జెల్వుగవత్తురు మాకనంగవే
చిత్తరపాటుతో గుహుఁడు దత్తటభూమికివచ్చెఁ జెచ్చెరన్

ఉ॥ ఆగుహుఁడా రఘూత్తమపదాది వినిస్పృహుఁ జూచి యిట్లనున్
ఓగుహనాథశేఖర నిజోజ్జ్వల సుందరనౌకగామివై
బాగుగ మమ్మునందఱ నపారితగంగను నుత్తరించు నీ
సొగసుఁజూడనట్టిదియె సచ్చరిత్ర ఘనుండవై యికన్

ఉ॥ ఆయనవంశు మాటలకు హర్షవితానసముత్సుకుండునై
పోయెను నావఁదెచ్చుటకుఁ బొల్పుగనింటికినాతఁడు న్మదిన్
హాయిగనావఁగొంచు జనులందఱు మెచ్చగ నాత్రయంబును
న్నాయనఘుండు భక్తివివశాత్మకుడై తరియింపఁజేసినన్

ఉ॥ నిన్నునుతింపశక్యమె మునీంద్రులకైనను రామచంద్ర నా
సన్నుతులాలకింపు మనసారనినున్ స్మరియించి వేడెదన్
పన్నగభూషణాది సురవందిత సంతత పాదపద్మ నా
కన్నులఁ జల్లనయ్యెనని కంజదళాక్షు గుహుండు పల్కినన్

ఉ॥ అమ్మనులెల్లవారికిని యా రఘువీరులు మ్రొక్కి చిత్రకూ
టమ్మునుజేరి తద్గుహలదాంబికము న్దిలకించుచుఁ సరో
జమ్ములఁజూచుచుండి సహజన్మనిభక్తికి సంతసించుచున్
అమ్మని యజ్ఞరక్షకుఁడు నావిధంబుననుండె సీతతోఁ

ఉ॥ కేకయరాజనందన స్వకీయసుగ న్వెసఁజేసినట్టి యా
భీకరకృత్య మప్పుడు నవీనముగన్దలపోసి బాష్పముల్
ప్రాకటమొప్పఁగార నతిబాధతో తల్లినిదూసి మందిరన్
ఆకరినోత్తముల న్మిగుల నాభరతుండు శపించి వెండియుఁ

ఉ॥ పట్టణమందుఁ బౌరులను బాగుగనా రఘురాముఁ గోరఁగా
దిట్టుచునున్న కొండలని శ్రీవరాజ్యశిపాలుఁ జేయుచున్
కట్టిడి బ్రహ్మచేసిన విపట్టున కున్మది బోవ యాయుచున్
ఎట్టులనైన నేను మనుజేశ్వరు రామునిఁ దెచ్చి సత్వరన్

ఉ॥ పట్టపురాజుఁజేసెదను భద్రగజంబున నూరేగించెదన్
పట్టపనేను ఛత్రమును మా రఘురామునకున్ ప్రియంబుగన్
నెట్టన రామవీరు పదనీరజ సంస్తుతిఁ జేయుచుండెదన్
పుట్టను రాజభోగముల మోహవిదూరుడనై క్రమంబునన్

ఉ॥ ఉల్లానందటి స్థనతఁ దశరథుండు వేవసింపఁజేసి
గొల్లన సందతేద్వగను గూలుమి శోకపరీతచిత్తులై
పెల్లుగనా వసిష్ఠమునిఁ బెద్దగఁజేకొని తారుఁదారె భూ
వల్లభుఁజూచువేడ్క నతివారణ సైన్య బలావహంబుతోన్

ఉ॥ మండిత దివ్యరత్నములు మానుగ నూత్నవినూత్న దీధియ
మెండుగనీనఁ దశరథము మిక్కిలివేగెమునన్ క్షణంబులో
నండతరాటవుల్గడచి చయ్యనగంగనుజేరె నంతలోఁ
జండతరాసిహస్తుఁడయి చక్కనినాగుహుఁ డుగ్రమూర్తియై

ఉ॥ రాజ్యమునందునుండ రఘురామునియిష్టములేక తానలన్
రాజ్యముసేయుమంచు జనులందఱుఁబల్కఁగ భూర్తమూర్తి
పూజ్యుని రామచంద్రుని యభోగ్యవనంబులఁ గయ్యమాడుఁ
భోజ్యమెనీకు నిద్ధఁజిభో! భరతుండ! యనంగనాతడున్

ఉ॥ బంధులతోడ నేను నతిభాసుతతన్ రఘురాముఁ గ్రమ్మఱఁ
సంధిలునట్లుఁజేసి భువిజాతసయుక్తముగాన యోధ్యకున్
బంధములన్నివోవ బహువారసు వందనముల్ఘొనర్చి యే
నంధుడఁగాను దీసికొనునట్టి విధంబునవచ్చితిప్పుడున్

ఉ॥ ఆరమణీయమైన భరతప్రభుమాటలు నమ్మి చెచ్చెరన్
గారుణికాగ్రగణ్యుడు నగణ్యసుపుణ్యుడు నట్టియాగుహుం
డారఘురామసోదరు ఘనస్మగ నన్నదిదాటఁజేసె సీ
తారమణీసమంచి భుజదర్పితు నారఘురామభక్తునిన్

ఉ॥ రాముఁడు లక్ష్మణుండు దినరాజశుభోదయకాలమందు సౌ
దామనిఁబోలుజీవనము దథ్యముమిథ్యనిహోఁదలంచుచున్
సీమసుమీలఁ బల్వురిలనేర్పుగ సంధ్యలు నగ్నిహోత్రముల్
యామహనీయలక్ష్మణుఁడు నంతటఁదాభవతాగమంబునన్

ఉ॥ కాంచి మహోగ్రకోపుఁడయి కార్ముకమున్దగనెక్కునెట్టి య
భ్యంచితబాహువిక్రమ మపారగతిన్మహిమన్నుల్లసిల్ల నే
చించిచెలంగదె న్నిపుడుఁ జిత్రగతి న్భరతున్నన న్నృపుం
డంచితబుద్ధి రామనరపాలుఁడు వల్దనెఁ దమ్ముకృత్యమున్

ఉ॥ దాపటికంబులేక భరతానుజుఁడప్పు గథంబుదిగ్గి తా
ఘాపలిఁజూచువేడ్కఁ దనముంగలసైన్యమునట్టెనిల్పి తా
పోపకృతాననుండగుచుఁ బుణ్యచరిత్రుని రాముఁజూచె సీ
తాపతిరాముఁడు న్తనదుతమ్మునిఁ గౌఁగిటఁజేర్చి యిట్లనెన్

ఉ॥ అందఱు సేమవంతులె ఘనంబుగఁబట్టణమందు నెప్పుడున్
యందఱుఁ బుత్రపౌత్ర ప్రముఖానుజులందఱు భద్రులేజగ
ద్వందితవిక్రమాఢ్య! సుఖంబుగ వచ్చినతీరుఁజెప్పవే
వందనమమ్మ తల్లులకవారిగ మాకునునిండుదీవనల్

ఉ॥ అన్నకుమ్రొక్కి తమ్ముఁడు ఘనంబుగనందఱిబాగుఁదెల్పి యా
సన్ననుపస్థితుండగు ప్రశాంతుని లక్ష్మణుఁజేరదీసి తా
విన్నదనంబుఁదోపగ భువీశ్వరుచావునుదెల్ప నందఱా
పన్నమనస్కులై ఘవిని బాధలమూర్ఛమునింగి ఁ త్తతిన్

ఉ॥ ఇద్దఱుతమ్ము లున్మిగులనీగెడుదుఃఖమునందు సోలుచున్
పెద్దయుఁ దండ్రియుందనకుఁ బ్రీతుఁడు మిక్కిలిదైవతంబునై
తద్దయుఁ గొప్పరాజు ఘనదంబగు స్వర్గముఁ జేరెనన్న హో
నిద్దఱుసోదర ల్ఘ నజరీయుత యశ్రుతచారుహస్తులై

ఉ॥ శాశ్వతపుణ్యలోకమున సౌఖ్యముగల్గఁ దలంచి యాద్వయం
బీశ్వరునిందలంచి తపవీరుఁడుఁ దండ్రికిఁ దర్పణాదులన్
విశ్వములోనిరాజకులవీరులు మిక్కిలినన్నుతింపగా
నశ్వరదేహముందలచి నందితచిత్తముతోడఁ జేయగన్

ఉ॥ ఈవిధిరామలక్ష్మణులు నింపుగఁ దండ్రికిఁ దీర్చి పిమ్మటన్
వేవిహితప్రకారమున వేదసుకర్మలనాచరింపగన్
భూవిదితుండు ఁగైకవరపుత్రుఁడు నాభరతుండు సంజలిన్
తావకపాదపద్మములె తద్దయుదిక్కగునాకు నెప్పుడున్

ఉ॥ కావుననీవు నేడుపదిఁ గౌతుకమార నయోధ్యలోసుసం
భావితరాజ్యపద్ధతిని పట్టముఁ గట్టుకొనీంద్రభోగముల్
భూవివరంబుజాత నతిపూతచరిత్ర సుశీల సీతతో
నావుడు రాముఁడు న్మిగులనవ్యవిధంబగు వాగ్విజృంభణన్

ఉ॥ నాడు సమస్తదేవతలునందఱు సర్వప్రజల్వినంగ నే
పాడునరణ్యభూమికి యపారగతింజని సంచరించెదన్
పేటుకతోడఁ బల్కితిని విశ్వమునందున హేయరాజ్యమున్
నేటితగంగఁ గోరగను నీప్రజలందఱు నన్నుఁ దిట్టరే

ఉ॥ ఆతలమైన రాజ్యవిభవాతిశయంబునకన్న మేలగున్
ఖ్యాతిగనిట్టివాసము ధ్రువంబుగనాపుడుఁ దమ్ముతిట్లనున్
ప్రీతిగ నట్లె సత్యపదవీయుతనొప్పి వనింజరింపుమో
పూతచరిత్ర! యిమ్మ ఘనపుణ్యతనొప్పెడు నీదుపాదుకల్

ఉ॥ సాహుజయానలు న్మృగుల సారసనేత్రలునైన తల్లులన్
ప్రేమతరంగలింప రఘువీరుని మిక్కిలిఁ బ్రస్తుతింప నా
శ్రీమహితుండు పూజ్యుడు వసిష్ఠమునీంద్రుననుజ్ఞఁజేసి యు
ద్దామయశోవిశాలమును దద్దయునొప్పెడి పాదుకద్వయిన్

ఉ॥ ఆభరతుండు సంతసిల నందఱు మౌనులు హర్షయుక్తులై
భూభరణాదికృత్యముల బొల్పుగ నారఘురామభక్తిన్
వేభరియింపుమంచు బృథివీపతులందఱు సన్నుతింప శ్రీ
దాభముతై నవానిని ముదంబుననిచ్చెఁ గృపాగరిష్ఠుడై

ఉ॥ భాసుర వేదమంత్రముల బాగుగవానిని బూజసేసి వి
భ్రానసురారియూథము విరాజిలు రాఘవపాదుకావళిన్
వేసతిఁగూడిపోయి యలపీఠమునందువసింపఁజేసె నా
రాసుతుడై నతమ్ముడును రామునిపాదయుగాబ్జభృంగమై

ఉ॥ పారములేనితోషమునఁ బాదుకలన్ఘనసింహపీఠిపై
దారసుపుత్రవంతుడయి లద్ధయుభక్తి వసింపఁజేసె నౌ
రౌర దయాగుణాంబుధియు రామునిలక్ష్మని యానుకృత్యమున్
యారమణీయపౌరులు సుదారమనంబునఁ బ్రస్తుతింపగన్

ఉ॥ అంతట రామచంద్రుడు ముదంబునలక్ష్మణుసన్నుతించి సం
క్రాంతమనస్కుడై సతితోఁగ్రక్కున నెల్లిటనుండిలేచి వి
శ్రాంతిఁగనుంగొనంగ మునిరాజులపత్నులఁగొల్చి నివ్వటన్
చింతలడంచి నేర్చెదము శీతలవాగమృతోక్తనీతులన్

ఉ॥ ఆహవరంగ సుప్రథిత హస్తపరాక్రమ విక్రమోన్నతుల్
మోహకళావిదూర ఘనముఖ్య మనస్సరసీరుహుల్ విసం
దేహులునైన రాఘవులు దీప్తపరిస్ఫుట బాణహస్తులై
యాహరదేవతాదు లమితంబుగ సంస్తుతనొప్పఁజేయగన్

ఉ॥ కాననగంధవాహనవ కానురిమేనులు హాయిఁజెందగ
స్నానసనాంతిపూరిత దిశావలయంబగు రాముదేవియున్
మానులసచ్చరిత్రుఁడుసుపుత్రుకునౌ వరలక్ష్మణుండు భూ
జానిని వెంబడించుచునువక్కన నత్రిమహర్షిఁగాంచినన్

ఉ॥ వచ్చినయాత్రయంబును నవాక్యపరాక్రమ భూరిధైర్య ల
త్యవ్రతప్రశస్త గుణధుర్యులు సీతనుఁగాంచి సేపఁబుల్
యప్పుఁడుఁబ్రేమతోనరిగి యర్ఘ్యసుపాద్యవిధుల్గొనర్చి తా
మిచ్చటలాడుచుండెను యమోఘవచస్కుఁడు నత్రిదేవుడున్

చ॥ పూజమొనర్చువేళను సుపుష్పమయాది సుగంధవస్తువుల్
ప్రాఙితపృత్తిఁదీసుకొనివచ్చిన యాయనసూయ భక్తిమై
భూజనుఁగాంచి తోషముసఁబుణ్యతరంబగు పాతివ్రత్య స
వ్యాజ సుబుద్ధిఁజెప్పె సమయోచితనీతుల వాక్చమత్కృతిన్

ఉ॥ ధర్మములోనినీతులను తార్కికవాదములోనితర్కమున్
శస్త్రసుసాయకాది ఘనవారణభేదన యుద్ధశాస్త్రమున్
మంత్రములాదిగాఁదెలిపి మన్ననఁజేసియు రామచంద్రునిన్
శస్త్రకదాయివై మిగులసన్నుతికెక్కుమటంచు వెంటియున్

ఉ॥ నీవలన న్నిరాధరజనీచరవర్యులు రామచంద్రుకే
ల్పావకసన్నిభోత్కట శరావళిఁచావని వ్రగ్గువారుగా
తావకకోర్కెఁజేసియును దద్దశకంఠుడు బంధువర్గమున్
పావనమైన రామశరపావకపంక్తుల దగ్ధడౌనికన్

ఉ॥ అత్రిమహర్షివీడ్కొని ముదంబునఁగాననవాసులై తగన్
చిత్రముల స్థలంబుల నభంగ సుపక్వ సుమాంసభక్షులై
చిత్రవిచిత్రమైన వనశేముషికి న్మదిలోనఁ బొంగుచున్
పాత్రతఁదక్కెప్పుడును వర్తిలుచుండిరి లంద్రియానలిన్

"అయోధ్యాకాండ - సంపూర్ణము"

సీ॥ ఆహవరంగంబునందు జీవంబులుఁ
గలిగియుఁ గూలినకరినరసముదా
రావణుండప్పుడు రాముని దేవిని
లంకఁ దెచ్చుటఁ జూడ రాక్షసప్ర
కరమునకును నేఁడుఁ గల్గెను మరణంబు
పరసతీవాంఛలు భద్రకరమె!
యంచుఁ జింతింపగ హసనముఖుండౌచు
రఘువరాగ్రణి వింటలక్ష్యమొక్క

తే॥ గీ॥ వీతిహోత్రునియస్త్రంబు భీతిఁగలుగ
నసురమృతుఁ జేయుమంచును నప్డుఁ దొడిగి
వైవ నదియును కంఠంబు వ్రక్కలించె
నిర్జరశ్రేణి మెచ్చగ నిపుణముగను

సీ॥ కుంభకర్ణుండిట్లుగూలిన యాతని
గాత్రంబునుండి పవిత్రమైన
తేజోమయంబగు దీధితియొక్కటి
రామచంద్రుని శరీరంబుసొచ్చె
విస్మయంబందిరి వీరాదివీరులు
నిదిస్సేమి యంచును నిఖిలదివిజ
వరులును యాశ్చర్యభరితమనస్కులై
తలచిరి రాముని దయయునంతఁ

తే॥ గీ॥ దల్లడిల్లిన మనమున దనుజవరులు
దైత్యవల్లభు కంత సోదరునిచావుఁ
జెప్ప నాతండు దుఃఖించి చేష్టలుడిగి
దైర్యగుణుడంచు ననుజునిఁ దలచితలచి

సీ॥ హాపులస్త్యసుపౌత్ర! హావీరజలరాశి!
కూలితే నీవిట్లు గొండమాడ్కి
హాదైత్యసంపత్! హావిప్రవాంఛిత!
వ్రాలిసితే నీవిట్లు బొలికంచినా
హాశర్వభక్తక! హాసుసంత్రస్త!
రామబాణంబున లయముయిచిప
హాసద్గుణస్తోమ! హావంశభూషణ!
పోయితే మనువీడి పుణ్యలోక

తే॥ గీ॥ పులపించును రాక్షసపూవరుండు
దుఃఖసాగరమున నిట్లు దోగుచుండ
నగ్రనందను డింద్రజిత్తుడు వచ్చి
తండ్రినోదార్చి యిట్లను ధైర్యముగను

సీ॥ అనుజనిహావ్యక్తె యడలొందగను నీకుఁ
జనిమేమి సేనుండ భ్రమియింగనుఁ
వైరిప్రీయల పరివారంబు నేఁజంపి
వచ్చెద విజయంబువర్ధిలంగ
నాజ్ఞయిమ్మంచును నందనుండునువేడఁ
బోయిరమ్మని యప్పుఁబుచ్చెననిక
లంకాధిపతియును రాక్షసనిచయంబు
గజరాజవాజులుఁ గలసిరాగ

తే॥ గీ॥ ధవళతరమైన దివ్యరధంబునెక్కి
ముకముసెయగవెడలెను దొర్పలుడయి
పాకశాసనవైరియు బహువిధంబు
లైనభేటుల నిస్వన మప్పుఁగలుగ

సీ॥ యుద్ధంబుసేయగ నొప్పుదైత్యునిఁగని
యారామవిభుడును యాంజనేయు
సంగదు సుగ్రీవు నందఱి వీక్షించి
యాహవమొనరింతు ననిన వారు
జయశబ్దములువల్క సక్రోధుడై యేసె
వైరితనువునను వాఁడిములుకు
లేఁబది నన్నింటి లీలగాఁదునుమాడె
రావణి యంతట లావుఁగలుగు

తే॥ గీ॥ విభీషణయమును జొప్పించె వికటవేష
ధారణుండయి దనుజుండుఁ దరణీకులల
మీద నదృశ్యుడగుచును భీతిఁజెంద
నందఱును మారుతాత్మజు డప్పు వడిగ

సీ॥ ఆకాశపథమున నసురయున్నాఁడని
పంచముఖంబులఁ బ్రస్ఫుటముగఁ
బుట్టించి యంతట దిట్టంబుగన్నన
దనుజుండు నారసిదర్పమునకు
సంతోషమునుగల్గఁ జయ్యన భూమికి
దిగివచ్చి వెండియుఁ దీవ్రబాణ
వర్షంబుఁగురిపింప వారించుచును రాము
వంద్రుండు హెచ్చగ సంకటపడి

తే॥ గీ॥ దివిజనాథుఁడొసంగిన పవిసమాన
శక్తిబాణంబుఁ గరమునఁజంపఁదాల్చి
సప్రయోగంబుఁజేసెను సకలలోక
భీకరంబుగ నప్పుడా వీరవరుఁడు

సీ॥ ఏ సమై బహుతీవ్రవేగమునై సంహార
దివ్యమై కిరణసందీప్తమగుచు
వచ్చి సౌమిత్రిసువాలంబుఁదాకినఁ
బవనంబువలన భూపతనమైన
తరువుపోలిక నష్టఘనశక్తిఁగూలిన
లక్ష్మణుఁగాంచి విరాగులగుచు
వాయుసుతుండును వాలిసూనుండును
వారిజముఖ్యుని వంశజుండు

తే॥ గీ॥ సత్యమాత్మజముఖ్యులు సమితదుఃఖ
సంతులయి మనఃపూర్త్యవాసంబుచేసెమొ!
యేమిసేయుద మిప్పు డింకెవరువిష్ణు!
రెండుపర్యాయములుఁగూడ బెంబుపడితి

సీ॥ నీతల్లి ప్రశ్నింప నేనేమిచెప్పుదుఁ
బమ్మత! యుంచని దాశరధియు
శ్రీరామసోదర! క్షితితలమందునఁ
బడితివయంచని వాయుసుతుఁడు
రామభక్తాగ్రణీ! రాచిల్లువాడవు
శుష్కించితేయందు సూర్యజుండు
సమరకౌశలి! నిన్ను శత్రువుబాధించె
నా యంచుదుఃఖిల్లె నంగదుండు

తే॥ గీ॥ పరిశోకగీతంబులం విని సుషేణ
నామకసినవర్యుఁడప్పుడు నరయుఁజూచి
శోకముడుగుడు యాతండు సుంతమూర్ఛఁ
జెందెనని చెప్పి మరియును సేదఁదీర్చి

సీ॥ వానరవరులార వర్తిల్లు నుత్తర
సంద్రంపుఁ దీరంబు సకలవృక్ష
యుక్తమై యప్పుడు కొప్పుచుండును దివ్య
సంజీవనామ కౌషధివయంబు
దానినిప్పుడు మీరుఁదప్పకఁదెచ్చిన
సౌమిత్రిపను నట్టిసకలహితము
నెవ్వరుఁజేతురు నేర్పొప్పఁజెప్పుడు
సప్తాబ్ధిజన్మకు సవినయుండె

తే॥ గీ॥ చేసి వందయును యంచు సుషేణుదాక
రాముభక్తినిప్రకటించు లక్ష్యమిదియ
యనుచు నుప్పొంగి సామీరి హర్షమొదవ
లేచె హిమవంతప్రాంతంబు లీలఁజేర

సీ॥ శ్రీరామసోదరు జీవనంబులునిల్ప
నంటనీసుతుడను యంచదీకని
వందనము చెప్పక నందమొంచగఁజేసి
యాకాశమార్గంబు నంద్రవట్టి
వాయువేగంబున వర్తిల్లుచునుదోవ
సకలరాజ్యంబులం పసిసివయము
లనుజూచుచునుబోయి రాముసిఁదలచుచుఁ
జేరెను హిమవంల శీతనగము

తే॥ గీ॥ బహుళపర్వత నిర్గత వారివయము
గరళకంఠుడునివసించు ఘనవనంబు
సద్ద సంతోషపదనుడై నగవరుండు
సంచరించెను యౌషధీవయము కొఱకు

సీ॥ వానరుం డై ద్యుని వాక్యము లశ్రద్ధితోఁ
దలచుచుఁదిరుగగ జలజాసులను
నాకరుం డై నట్టి నవ్యసరోవరం
బొక్కటిపొడఁగట్టెఁ బోల్పుఁ వనః
తత్తటమందు నుద్దామాత్మయోగత
పంబుచే మిక్కిలిశక్తిఁ గలుగఁ
బరమేశుఁ గోరెడువాని విధంబున
నున్నట్టి వృషయోగి నొకనిఁగాంచి

తే॥ గీ॥ వినయవినమితుడై యోగి వేడ్కతోడ
నడిగె సంజీవవృత్తాంత మప్డుమునియు
“లక్ష్మణస్వామి సప్రాణ రంజితుండు”
చెప్పె సంజీవివద్దని యంపె నన్ను

సీ॥ ఆలిపల్కు మునినాథు ఘనముగ వీక్షించి
జనహితంబైన వనములందు
సిలకొక్కఁడు నొంటి నిష్ఠతోఁదపమును
జేసెడుఁ జూడంగఁ జిత్రమౌను
మాటలు విపరీతమైతోచు తనియెద
నందుఁ బావని పూర్వమట్టులాడఁ
గోపించి మునియును ఘూర్ణితనేత్రుడై
వాయుపట్టిని యొక్కపరుషవాక్య

తే॥ గీ॥ మాడ నాతడుజృంభించి మహినిఁ జలచి
గజ్జ సేయుచు నాతని కంఠతలము
హస్తపుద్ధినఁజేయుగ నతఁడుగూలె
నిజభయంకరరూపంబు నేర్పుఁదాల్చె

సీ॥ నన్నువంచించి తానరిగెంటో శమనుని
పట్టణమార్గంబు నట్టివట్టి
రాక్షసుండీతండు రామునిదయచేత
నిప్పుడుఁజంపితి నేనునింక
నెక్కడికేగుదు నెట్లుఁగాంతుకొయంచు
సంకటపడి వాయుజాతుడపుడు
సన్యోన్యఘర్షణ క్షతములువాయంగ
జలజాకరంబున స్నానవిధులఁ

తే॥ గీ॥ జేయనంచును దలచి తప్పేకరాంబు
కణములనువోగి మగుడంగఁ గాలువట్టె
ఖరతరంబైన వక్రనక్రంబుయొకటి
తనదుదంష్ట్రల బాధించుచును గడంగి

సీ॥ ఇదియేమిటకో నన్ను మదమునబాధించు
చున్నది యంచని చూడ్కినిలిపి
సత్త్వసంపన్నుడై సామెరి పాదంబు
జాడింప నదియును సకలమైన
గ్రాహరూపముఁబాసి కమనీయభూషణ
కాంతులు దిశలెల్లఁ గ్రమ్ముకొనగ
నంగనయై మ్రోలనగుపడ నాతండు
నీవెవ్వతెవు నిందునేగుదేరఁ

తే॥ గీ॥ గలుగుకారణమిప్పుడుఁ బలుకుమన్న
నదియు వినమితగాత్రయై యంజనీజు
కిట్లుఁజెప్పెను మనమున కింపుఁగలుగు
నరసంయుక్త భాషణ చతురిమముగ

సీ॥ రామభక్తాగ్రణీ! రక్షించితివినన్ను
దుష్టరూపముఁబాసి శిష్టనయిలి
నాట్యశాస్త్రంబున నలువలో యప్సరో
కులమందు నేనును గొప్పఁబుట్టి
శతమఖునానతి శైలణాధిపువేడు
సద్బ్రహ్మణాంశజుఁ జపలుఁజేయి
సక్రమక్రంబవై వణలుచుందుము పొమ్ము
దుష్టయంచును నన్నుఁదొలఁగఁద్రోల

తే॥ గీ॥ శాపమోక్షంబుసెప్పవే సత్త్వతేట!
యనిన నాతండుఁగరుణించి యప్డుఁజెప్పె
రామ కార్యార్థమై కపిరాజుయొకడు
వచ్చి భవదీయతనువు నవాప్యఁగను

సీ॥ స్పర్శింప నీదైన జన్మంబుఁగలుగును
పోయివచ్చెదనంచుఁ బోయెదివికి
నీకృపచే నన్ను నిప్పుడుఁబాపిలి
హేయజన్మంబున హింసపలన
జీవింపు నాదైన చేతలు దీనికిఁ
బ్రత్యుపకారంబుఁ బడయుమయ్య
నీభుజబలముచే నీల్గినవానొక్క
లలిరాక్షసుడు పేరు "కాలనేమి"

తే॥ గీ॥ నిన్నువంచింపనెంచి తానేగదివికి
భావియుగమున నితడు దుర్భావుడగుచు
జన్మనొందును "కంస" భూజానియగుచు
విష్ణుచేతను మరణంబు వీనికపుడు

సీ॥ అనిచెప్పి యప్సరోవనితయు వాయుజా
వీక్షించి యిట్లను పిదపవత్స!
సీతామితార్థము నేనెఱుంగుదు రామ
సోదరు బ్రతికింపఁ జొచ్చి వెదుకఁ
బోవుచున్నావు పుణ్యాచార్యంబులఁ
జేసిననేగదా సిద్ధిఁజెందు
సకలవాంఛలునందు సారసనేత్రయుఁ
జూపె నాతని కష్ట శోభితంబు

తే॥ గీ॥ దివ్యతరుపుల పదమును దివిజగంగ
జలము నభిషిక్తమైనట్టి "సంజీవాఖ్య"
పర్వతశ్రేష్ఠ మానంద భరితుడగుచుఁ
దద్గిరీంద్రంబుఁజేరెను తన్వియరుగ

సీ॥ ఒకచోట ఫలపుష్పయుక్తంబులైనట్టి
కమనీయ రావులఁ గాంచెనతడు
ఒకచోట మత్తాళియూథంపు ఝుంకార
సంగీత సద్వనస్థలములొప్ప
ఒకచోట నోషధీయుద్ధత లతలను
గాంచెను కన్నులంగటవుఁ దీర
ఒకచోట జపతపోయోగంబు సల్పుచు
నిల్కాడరానున్న నిష్ఠపరుల

తే॥ గీ॥ గరుడ గంధర్వకిన్నర వరులఁగూడి
సంతతానంద సౌభాగ్య సకలసుఖము
లనుభవించెడు కోనల నప్డునొక్క-
చోటఁజూచెను గరువలిసూనుడంత

సీ॥ ఎంచశోధించిన నిమ్మగఁదనమును
వలయునట్టిది పొందవలను ఁడని
పాలయూపననాట గ్రహియించి యింతను
దడపుసేసినఁ బనితప్పిపోవు
ననిబుద్ధిఁ దర్కించి నగరాజమును రాము
సన్నిధికెనిష్టఁ జక్కఁ జేర్చి
మాఘిషగ్వరుడును బరికించి సంజీవ
లతికను జేకొని లబ్ధజీవ

తే॥ గీ॥ నుగఁ జేయును లక్ష్మణాఖ్యనురియనును
స్వర్గగజకోవ ఖాతినిఁ జాలబలముఁ
గలుగువాహుద్వయంబునఁ గదలఁ జేసె
నిపలరాముని వృక్షమ్ము నీడ్చినట్లు

సీ॥ సర్వజనాభీలజనకంబుగా గిరిం
ద్రించుచు నటుచేత రాజిలుచుగఁ
బట్టి సత్త్వంబునఁ బవనపుత్రుండప్పు
లంఘించె నాకాశలక్ష్యముగను
సుకసంఘమంతయుఁ జూచుచు సుమరాజ
వర్షంబుఁ గురియింప హర్షమొందని
మారుతవేగుడై మహానుతికెక్కఁగ
క్షణములో దేశంబు లధిగమించి

తే॥ గీ॥ యుద్ధశిబిరంబుఁ జేరె నయోధ్యవరుఁడు
వానరసమూహమంతయు భక్తివినయ
సంభ్రమంబులఁ దెసగొని సన్నుతింప
గిరిని ధరణిపై నిడిమె నాక్రాంతమూది

సీ॥ బ్రహ్మాండభాండంబు బ్రక్కలించెను మే
యాఁగని వైద్యుండు నెంచుచునగ
రామభక్తునకెందు రావగు దుఃఖము
లుంగునే యంచని కపులుపల్క
సంతోషచిత్తులై జనకజాధిపుఁడును
వాతజా బహుధైర్యవర్తనంబు
వలనఁ గార్యమునయ్యె నిలఁగీర్తి హెచ్చెను
యంచని హర్షమయమునఁ బొంగ

తే॥ గీ॥ స్వీకరించియు వైద్యుని చెంత కేగి
తడవు సేయక సంజీవిపర్వతంబు
చేత లబ్ధిపసునిగఁజేయుమయ్య
లోసుమఁబ్రార్థింప నంతను యాద్రికడకు

సీ॥ త్వరితంబవేంచేసి వారిజమిత్రుని
రాకఁ గాంక్షించి యామము నిష్ఠ
దేవతలందఱి దీవనలైకొని
సంజీవనామంబు "సకలమృత్యు
వారిణి" యని పల్కి పరిశాఖనొక్కటిఁ
గరమునఁదాలిచి పరమభక్తి
మంత్రములుపలుకుచు "మహిఁబలియుండైన
లక్ష్మణస్వామి లావుఁగలిగి

తే॥ గీ॥ లేచుఁగావుత" యంచని లీలనపుడు
నాసకొనయందు నాకులనుంచునట్లుఁ
జేయఁ దెప్పిప్రదసుండి లేచినవిధంబుఁ
గాగ నుత్థితుడయ్యె లోకంబు మెచ్చ

సీ॥ రాక్షసాధమ! నిన్నుఁ బొడిచంపెద
నంచని యనుజుండు నపుడు పల్కె
శత్రువర్గంబులు సమసిపోయెనిలేవు
కోపము నుడుగుమంచు మారుతియును
బల్కె లక్ష్మణుని దీర్ఘబాహుల నాలింగ
నంబుఁ జేసియు బహుసవ్యమైన
ఫలసంతతులు పెట్ట భక్షించి యాతండుఁ
దొంటి విధంబునఁ దోఁచె నంత

తే॥ గీ॥ లంకనగరంబుఁ జొచ్చి తెల్లంబుఁ గాగ
తంత్రికంతయు నింద్రజిత్తుపుఁ జెప్ప
నిదియ యదనని తోషించి మదమెసగఁ
గదనమొనరింప నద్దశకంధరుండు

సీ॥ కాల్బలంబును రథగజములు తురగంబు
లాదిగజనులు మేలంచుఁ బలుక
సామంతరాజులు సహచరుల్తోడుగ
రాగ రోషంబున రంజితుండు
నగుచు రామునిఁ దోడ నాహవమొనరింప
భేరిభాంకృతులు దిగ్వీధినిండ
వింశతిభుజముల నస్త్రంబులు మోపెట్టి
వచ్చిన రాముండు భయముఁ గలుగ

తే॥ గీ॥ బ్రహ్మతేజంబు ముఖమునఁ బటిమదనర
వెలుగుచున్నది వీని నేవిధమునైన
నొంచుటకు సదుపాయంబు నూహఁ జేయ
వలయునని మిత్రవర్గంబు వైపుఁ జూడ

సీ॥ ఇంతలోపల రావణేశ్వరుండప్పుడు
దశహస్తములను యుద్ధమునవేయి
మధ్యమార్గములోన మార్తాండ మండలం
బన్నియుఁ గ్రుమ్మంగ నక్కజముగ
రెండవసారి వర్షంబులగు యస్త్ర
లన్నియు నెసరిన రామచంద్రు
నిశితవిశిఖముల నుగ్గాడు నుండంగ
సతమును వివిధాస్త్రతతిని వేగ

తే॥ గీ॥ మునను రాముని నేసినఁ బూర్ణకోప
కలితముఖమున రాముండు ఘనతరంబు
లైన శతసంఖ్యశరముల నవనిజాక
హృత్తుగర్వంబు మాయించె హుంకరించి

సీ॥ ఆగ్నేయశరమున నతభీకరాగ్నినిఁ
బుట్టింప వారుణంబున నమేయ
జలమునుఁ గురిపించె జనకజాధిపుడును
శ్రయవర్యుఁడు నంత సర్పములను
మదమున వైచిన మానవపతియును
గరుడాస్త్రగములను గరినమగను
జొప్పింప నాగముల్ సొక్కినఁ గ్రిదుపి
రొధియు మనమున రోషమంది

తే॥ గీ॥ సప్రయోగంబుఁ జేసెను సకలజనధి
యంకరంబును శ్రేష్ఠంబునైన విశ్వ
కర్తయస్త్రము హస్తయుగంబు మొగిచి
ప్రార్థనంబునుజేయుగ వ్యర్థమయ్యె

సీ॥ తోయజహితుఁడిష్ట తూర్ణంబ వచ్చెను
వార్ధిలోఁ గ్రుంకెను వైరిగనుచు
సంగరంబును నేఁడు చాలింతమని చెప్ప
నంతటఁ దమతమ యాలయముల
చనిరి లంకాధికారియు ఘనునివ
హాంబుతో నేగెను యుప్పసించి
యుద్ధరంగమును నోపృప సైంకు
ల్పనిద్రఁ బొందిరి సుఖతరముగ

తే॥ గీ॥ దివసమూనవరూపులు ధ్రువకరులుఁ
దంచుమంచితి ఖావియుద్ధంబు లెట్లుఁ
బరిభాషంబులో యందరి బాలకాను
చూచయుమధ్యాను సంతసమొదవన వృషు

సీ॥ రావణుపంపున రాక్షితాస్త్రంబులఁ
గొనివేగఁ గుంభకుంభాదులంత
దర్పంబుఁ జెలరేగ దానవాంతకుడైన
రామునిమీదికి రంపహారగుమ
మూఁకు బాణముతేయ పూత్కారమునుపల్కి
దశరథతనయుండుని చితిపికి
ములను రెట్టించిన మోహునవేయంగ
నోలిరిద్దఱు సంగభమంగముగఁ

తే॥ గీ॥ భైకిలేచిరి కరములఁ బటుపుఖడ్గ
ములను బట్టియుఁ గౌసల్యపుత్రుడంతఁ
జిత్రబాణంబునేసి విచ్ఛిన్నముగను
జేసె హస్తద్వయంబును సిగ్గుగొంద

సీ॥ వీరాధివీరులం వినుత యశోధను
లుఁ గుంభనికుంభుల కుత్సితంపు
మరణంబు లెల్లను సురవిరోధికిఁ జెప్ప
నత్యంత ఖిన్నుడై యతడు నింద్ర
జిత్తునుబిలిపించి సేనతో నరులపైఁ
జెచ్చెర నేగుము సితజవాశ్వ
ములను శతాంబకంబులను దాల్చియు దుం
మునుజేయుటకు రామభూపుతోడ

తే॥ గీ॥ నన్న జనకుని మాటల నాదఁదాల్చి
పటుతరాస్త్రసమేతుఁడై చటులరాక్ష
సప్రజాలముఁ గొల్వగఁ జనియెననికి
దైత్యులగ్గింప సురలుమోదంబు డింప

సీ॥ సీతాహృదయహోరు జితవైరివర్గుండు
రాముండుఁ దమ్ముని రణపటిష్ఠుఁ
గాంచి యిట్లను లోకకల్యాణమేర్పడ
నాజినిహరియింపు మమితశౌర్య
నింద్రజిత్తును నేను నిఖిలరాక్షసచయం
బడగించి శ్రమమునుబట్టినాడ
యుద్ధంబుఁజేయంగ నోపంగలేనన
సౌమిత్రి యత్యంత సంతసంబుఁ

తే॥ గీ॥ గలుగఁ బగతుబఖండింపగలను మఘవ
జిత్తు గర్వంబుఁ దూలంగఁజేసి నీవు
మెచ్చునట్లుగఁ జేసెద మేలు యాశి
షంబులిమ్మంచు నాడిన జనపతియును

సీ॥ తమ్మునిచేతకుఁ దరణికులుండును
హనుమంత సుగ్రీవ యంగదాదు
లందఱు మనముల నానందమొప్పార
వినుతిఁజేసిరి భుజవీర్యమునకుఁ
దక్కటిమూకలు దండెత్తివచ్చినఁ
దరలగఁదోచెను ధైర్యముగను
ననిలజాతుండప్డు నాహవభూమిని
శేషరాక్షసులును సిగ్గుఁజెంది

తే॥ గీ॥ లంకనగరంబునొచ్చి యారావణునితో
యగ్రపుత్రుని మరణమంతయును దెలుప
మూలవిచ్ఛిన్నమైచెడి భువినిఁగూలి
నట్టివృక్షంబుపోలిక నతడువంత

సీ॥ ధరణినిగూలి హాతనయ! పరాక్రమ
ధుర్య! నీనిండు పందురనిమోము
నికనెప్డుఁజూచెద నిల్గితేయనిరోన
మమ్మందఱనుబీడి మర్త్యలోక
మునసుండనీక నిన్మందుగాఁజేకొని
యముడెట్లుఁజొచ్చె నన్యాయపథము
దుష్టబుద్ధినినేను తుంటరి తనమునఁ
జేసినదానికిఁ జిక్కితిప్పు

తే॥ గీ॥ నీదునామంబు భుజముల నిష్ఠురతయు
మఱచిపోవగరాదుగా మాన్యచరిత!
రాజసత్కారసౌఖ్యంబులందుఁ దేలి
యుండవలసినవాడవు యుద్ధనిపుణ!

సీ॥ అరిమునకపిల్లుసి ఘనకాయుడైనట్టి
దశకంధరుండు మొత్తమును సైన్యం
దరివాల్చియుండంగఁ దత్పరివారక
తతులును రీతిమైనయ వారి
కణములఁ బెర్చిన ఘనకపితాప్తుడై
కాకుత్స్థతిలకుల స్కందనమందు
నిర్జించుమార్గంబు నేరకఁ దలపోసి
స్వాయముగ వారినిఁ జంపఁజూత్తు

తే॥ గీ॥ ననుడు రెండవసారి కయ్యంబు సేయ
వచ్చె నాహవభూమికి భటులు హేతులు
రథగజంబులు రాక్షసప్రకరములును
గొల్వ దాకొండు దైత్యేరకాండమాత్కి

సీ॥ సాహసర్వమేర్పడ సకలనారసముల
నేసిన నన్నింటి నిమిషమాత్ర
కాలంబునందున ఘనరామబాణంబు
వారింప వైరియు వానరతతి
నొంపంగ శూలంబునుగ్రతవైచిన
నవసజుందును దానినణగఁజేసె
వింశతికరములఁ వేత్వేఱ ఖడ్గము
లైకొనివేయగఁ గడునలిగియు

తే॥ గీ॥ దివ్యబాణంబు సంధించి దివిజగణము
మెచ్చ ఖడ్గవితానము మిక్కిలిగను
తునుకలగునట్లు ఖండించె దోఃప్రతాప
మతిశయిల్లగ జనకజామాతయపుడు

సీ॥ సౌమిత్రి పదిపది జనితవైరముచేత
బాణంబులేయగఁ బటుకరాళి
చైత్రేయవరుడును దరలంగఁజేసియు
నతనిని శతసంఖ్య నంగములు
ముంచిన వాచితూపులనేసి లక్ష్మణ
స్వామియు నవియెల్లనసిపోవఁ
జేసె నంతట రణసింహుఁడుఁ దాపని
యరివీరసేనల హస్తగదను

తే॥ గీ॥ నుగ్గుగాచగఁజేయుచు నిఖిలదివిజ
వరులునుతియింపఁ బ్రస్ఫుటవాక్యరచన
రామభక్తుండు రాజిలె రణతలమున
దివిజశత్రుఁడు మాన్యాకనేఁజెదరిలుచు

సీ॥ రామచంద్రుఁడు నప్డు లంకాధిపతిఁజూచి
దుర్మార్గుఁడనమున దివిజగణముఁ
దల్లడిల్లగఁ గామపాసుండవయి నీవు
మారీచమాయను మరువఁజాలక
జేసియుఁ జపలాక్షి సిగ్గింతయునులేక
సీతను దెచ్చితి చెట్టఁబట్టి
సంతోషమున నప్డు సలిపితివంతయు
నోర్చుము వివిధంపునుగ్రబాణ

తే॥ గీ॥ తతినిఁజూచెద నీయుద్ధరనమునుచుఁ
బలుక మానసమునూలంగ నలుకఁదనర
యుద్ధధరణినివీడి యహోయనుచును
యాక్మపురమునుజేరె రాక్షసవరుండు

సీ॥ ప్రఖ్యాతమున బహుసమ్మతికెక్కిన
కుంభకర్ణుండట్లుఁ గూలుటకును
పుత్రాగ్రజుండును బురుహూతగర్వని
ర్వాపణుండును నైనవానిమరణ
మునకును మనమున ఘనముగఁ జింతించి
మంత్రిపుంగవులను మాన్యచరితు
లను పురోహితులను రాక్షసప్రవరులఁ
బిలిపించి మిక్కిలివినయమొప్ప

తే॥ గీ॥ నిట్టులను నాదుదుఃఖంబు నేర్పుతోడఁ
బోవునట్లుగ దశరథపుత్రయుగముఁ
ద్రుంచునట్లుగఁ జేయుడు యుక్తదేహు
లార! నయవంతులార! మీలావుబుద్ధి

సీ॥ అనినరావణు మాటలాలించి వారును
చిత్తంబులొక్కటఁ జేతఁబట్టి
ఘనముగఁ జింతించి కాకుత్స్థవర్యుల
నిర్జించువిధమును నెఱుకసేతు
మనుచు రాక్షసనాథ! పాతాళయజ్ఞంబుఁ
జేసినవారలుఁ జిత్తసుఖము
నొందియు వైరులనుగ్గాడి జయలక్ష్మిఁ
బడసినగాథలు భాసురములు

తే॥ గీ॥ పరమభక్తిని మీధర్మపత్నితోడఁ
గరము హోమంబుసేయ విఘ్నంబుఁబొంద
కుండవలయును లేనిచోఁ గూలఁగలదు
సర్వవంశంబునని వారుఁజక్కఁబలుక

సీ॥ రాజితంబగు మాటలనువిని రావణుం
డంతట నగవంబు భసుదుద్ధ
వంతంబుగనుజేసి పాతాళహోమంబు
జరుపఁబడుననియుఁ జూడఁబంచె
సకలరాక్షసులును జనుదెంచి రపటకిఁ
జూడువేడ్కతో బహుశోభితముగఁ
బరిచారతతులును బహుళంబుగా నలం
కృతుఁజేసిరి సభాతలమ్ము

తే॥ గీ॥ భార్గవుండగు శుక్రుని భాసురముగ
బ్రహ్మపీఠంబుననయుంచి ప్రముఖతతిని
వివిధపనులకు నియమించి వేడ్కతోడ
దీక్షఁగైకొనె రావణదివిజవైరి

సీ॥ వివిధంపు ఋగ్వేదవృత్తంబులను నొక్కి
రాత్రించరుండును విమలఁబలుక
జయశౌర్యములకు భాసంబైనమంత్రము
ల్చదివెను యొక్కడు సంఘసముగ
అగణితాజ్యఘటంబులన్నియు శిఖలందుఁ
గ్రుమ్మరింపగ నవిటాక్షమైన
దీధితుల్చిమ్ముచు దిగ్వీథులన్నియుఁ
గప్పగ నాకలోకమున నింద్ర

తే॥ గీ0 గురులుభయమునుజెందిరి కోటిమూక
లన్నియును గగుర్పాటున రామచంద్రు
చరణకమలంబులకుమ్రొక్కి చాలభక్తిఁ
దశయకెఱిగించి యప్పుడుదద్విధమును

సీ॥ అంత రావణుతమ్ముఁడైన విభీషణుం
గంతయు నెఱుగంగ నతనిభటుల
సత్వరంబుగఁబిల్చి సంక్షోభకారణం
బరసిరమ్మనిపంప వారుఁదిరిగి
దశకంఠకృతమగు తద్యాగమునుజూచి
యిదియదీనికి సర్వహేతువనుచుఁ
దలచి రామునకును దైతేయవరునకుఁ
జెప్పిన నాశ్చర్యచిత్తములతో

తే॥ గీ॥ మునిగియుంటిరి యంతటభూవరుండు
దీనికధనంబుఁదెల్పుడు తేటపడగ
ననుమవేడగ నందఱునాకసంబుఁ
జక్కఁజూచిన గుణవిభీషణుఁడు మఱియు

సీ॥ వారఘాత్మజ! రామధరణీశ! మాయన్న
పాతాళహోమంబు భరితరోష
దగుచుఁ జేయుచునుండె నదిపరిపూర్తిగ
నయినచో మనకుఁగీడావహిల్లు
దనుజుంను మరణమొందకయుండుఁ గావున
దీనినివిఘ్నంబుఁ దివిరిఁజేయ
వలయును నావుఁడు వనజాతనేత్రుఁడు
జనకజాధిపుడును సైన్యవరులఁ

తే॥ గీ॥ జూచి మీరొనసవనంబుఁజొచ్చి వికట
వేషభాషల రాక్షసవిభునిమనముఁ
జెదరిపోవంగ నెవ్వరుఁజేసెదరనుచుఁ
బల్కఁ వాలితనూజుఁడు వచ్చెనపుడు

సీ|| హోమగుండంబులు నుపయోగ రహితమై
వల్లారె తేజంబు సర్వమడగ
బ్రహ్మాదిముఖ్యులుఁ బరిభవింపఁబడిరి
వానరతతిచేత వన్నెఁదఱిగి
సర్వజనాఖిల జనకంబుగాఁ జేసి
నను రావణుండును నధికభక్తిఁ
గలిగి సంచలనంబుఁ గాకుండుటను జూచి
వాలి తనుజుండు వానిభార్యఁ

తే|| గీ|| బరమసాధ్విని సాహస పక్ష్మనేత్రఁ
గంబుకంఠిని నిత్యశృంగారవిభవ
నైనమండోదరినిఁబట్టి నగుచునీడ్చె
ధరణిమీదికి జనులెల్లఁ దల్లడిల్ల

సీ|| కబరీభరంబును ఖర్షణఁగావించి
యవయవంబుల నంత హాస్యముగను
స్పర్శఁజేయుచు బహుపరుషవాక్యంబులఁ
దిట్టుచుఁగొట్టుచు దివిజవైరి
కనుగొనుచుండగఁ గాసిల్లఁజేసినఁ
గావరేయనుచు నక్కాంత దీన
ముఖమున నాత్మేశుమొంగిట నేర్చిన
విగతనిష్ఠత నష్టవిభుఁడుఁగలగి

తే|| గీ|| రోషవిజృంభనయన విలోలుడగుచుఁ
గీడుదెచ్చెఁడు నాసతిఁగీడువెట్టె
వానిఁదీర్చెదనంచును బాహుబలముఁ
జూప మర్కటవీరులు నంతరేగి

సీ॥ వైకుంఠవాసుఁడు వాసవప్రార్థన
జయశీలుఁడై ధరజన్మమంది
దశరథసుతుఁడయ్యె దానవాదులఁ జంపఁ
దాటికి వధియించెఁ దరుణిఁ జేసె
మౌనిజన్నముఁ గాచె మాయించె ఖరరాక్ష
సప్రకరంబును విప్రకులము
రక్షించె వాలిని రణమునఁ దునుమాడె
సుగ్రీవుభయమును సోలఁ జేసెఁ

తే॥ గీ॥ పవనసుతు భక్తులందునఁ బరిగణించె
గిరిశకంఠునివిల్లుఁ బల్కుడిమిఁ ద్రుంచె
జనకనందనఁ బెండ్లాడె సకల జనులు
సంతసంబునఁ దేలగ జనవిభుండు

సీ॥ తండ్రియానతిఁ దాల్చి ధర్మమార్గంబున
రఘువరుండును నిజరాణితోడ
సోదరయుతుఁడునై సుస్థిర కానన
వాసంబుఁ జేయగఁ బర్ణగృహము
నందునుండగ సీవనంగ బుద్ధినిఁ గల్గి
నాతినిఁ దెచ్చితి నాశమొదవ
హీనబుద్ధిని మాని యినకులు భార్యను
నప్పణసేయుము నాకునచ్చు

తే॥ గీ॥ పరులభార్యలఁ దెచ్చుట భద్రకరమె!
కరమువారికి నెందు సద్గతులులేవు
ధర్మశాస్త్రాది విద్యలఁ దనరి నీవు
నెట్లుఁ జేసితి హేయమై యిట్టిపనిని

సీ॥ యుద్ధంబువలదిక్ష నుడుగుము యంచని
తత్సతివినుతింప దనుజవరుఁడు
డాకాలనామెను ఢంబంబులను బల్కి
తన్నినఁ దత్పాదతాడనమునఁ
బడమిపైఁగూలి వేమూర్ఛనొందినఁజూచి
రణమునకేగెదు రాజితముగ
నంచు దశగ్రీవు డాలోచనంజేసి
సుభట సైన్యంబులు సురుచిరముగ

తే॥ గీ॥ వెంటనడువంగ నరివీర భీకరముగఁ
జిహ్వసేతకు సరుగంగఁ జేతనంబు
నందుఁదోచెను రాముడు నరుఁడుఁగాడు
దైవమంచని దురితుండు దనుజుకపుడు

సీ॥ హేషారవంబు లహీనమై చెలగంగ
గజబృంహితంబులు ఘనతనొప్ప
సైనికకలకలస్వనములు నిగుడంగ
శరములనాదంబుఁ జదలునిండ
రథములరావంబు రాజితంబుగనుండ
జయసూచకధ్వను ల్పక్కు మెఱయ
భూషణోదంచిత పొల్పగుసద్దము
భేరులనిస్వనం బెలమిహెచ్చఁ

తే॥ గీ॥ గదనరంగంబు విలసిల్లె ఘనుల రామ
రావణోగ్రపు బహువిధ లాఘవముల
జయము జయమని దివిజులు సంతసించి
కుసుమ రాశిని దివినుండి క్రుమ్మఱింప

సీ॥ సన్నద్ధులైవచ్చి శాతనారసముల
రాఘవేంద్రునిముంప లక్ష్మణుండు
వేవేగవానిని విధ్వంసమునుజేసి
మెఱయంగ రాక్షసవీరుఁడప్పుడు
రోషముదీసింప రుద్రాకృతిందాల్చి
బహువిధాస్త్రంబులఁ బటుజవమున
పంచటిసేయంగ నర్కసుతుండును
భయపడి రాముని పాదపద్మ

తే॥ గీ॥ ములనునంటుచు నిట్లను భూపవర్య
దైత్యవరుఁడిప్డు రణమున ధాటిఁగలిగి
వెలుగుచున్నాడు దక్షిత వీనిఁజంపు
మనగనౌనని రాముండు నతనిలోడ

సీ॥ ధరణీతలంబున దశరథసుతుఁడును
గమనీయరథము పై ఘస్మరుండుఁ
దనరగనిలబడి ధర్మయుద్ధము సేయ
సురవిభుండును మదిఁజోద్యమంది
మాతలిఁబిలిపించి మాణిక్య దివ్యస
ద్రథమిచ్చి యనుపగ రాజిలముగ
నతడుఁబుడమికిని యరుదెంచి యరదంబు
రామునకివ్వగ రవినిఁబోలి

తే॥ గీ॥ సూర్యకులుడప్డు దానిని సురుచిరముగ
నెక్కి యుద్ధంబుసేయగ నింద్రముఖ్యు
లంతరిక్షంబునుండి కీర్తనలుసలిపి
రిందువదనుని మెచ్చి వైరినిఁ దెగడుచు

సీ॥ వాతతనూజుండు పరతరువుల శైల
గములను రాక్షసగర్వమడప
సుగ్రీవయంగదు లిచ్ఛ్రతంబుగా వైరి
సేనను దుదముట్టఁ జేయుచుండ
నిశితమార్గణముల నేర్పొప్ప రావణు
మేనున రాముండు మించివేయఁ
దక్కటిదైత్యులు దర్పంబునందాక
వానరశ్రేణియు వారిఁజంపఁ

తే॥ గీ॥ ఘోరవిలపిల్లెఁ గైకసీపుత్రుబలము
తగ్గఁజొచ్చెను దశరధతనయుబలము
విస్తరించెను దద్వేళ వేదవిదుఁడుఁ
గలశజుండశ్వపటికివచ్చె ఘనతనొప్పి

సీ॥ పరపుతపోదనుఁ బర్వతగర్వసం
హరణుని మున్నీటియంబుతతినిఁ
గ్రోలిన ఘనసత్త్వుఁ గొమరారఁగాంచి వి
నీతిమైనెఱగిన నేత్రపద్మ
ములను రాముని రూపమునుజూచి యోపుత్ర!
శుభమగునీకును సుస్థిరముగ
దుష్టులశిక్షింప శిష్టులరక్షింప
జననమందితివీవు సత్త్వతేజ!

తే॥ గీ॥ పుణ్యజనుడిష్ట దినకరుఁబోలియున్న
వాడు నీబలమున్నపుడు వన్నెఁదఱిగె
లోకచక్షుని దినరాజుఁహూంఁ సూర్యుఁ
గరము ప్రార్థింపుమనిమౌ నగస్త్యుడంత

సీ॥ సర్వపాపంబుల న్నమయించుదానిని
శత్రువర్గంబును జంపుదాని
దినకర మహిమచేఁ దేజరిల్లెడుదాని
జపియించువారికి సర్వలాభ
ములను గూర్చెడుదానిఁ బుత్రార్థులకు శత
పుత్రులనొక్కటఁ బొందఁజేయు
దానిని వేదమంత్రంబుల నొప్పెడు
దానిని సుఖములఁదనరుదాని

తే॥ గీ॥ దివ్య "యాదిత్యహృదయంబుఁ" దీవ్రపటిమ
ధర్మయుతముగఁ జెప్పెను దశరథసుతు
నకు నగస్త్యమునీంద్రుండు నమరవరులు
మేలుమేలని నుతియింప మించెఘోష

సీ॥ స్నాతుడై రాముండు జపతపములఁజేసి
ధ్యానించె సత్యముఁ దపను భానుఁ
జండాంశు దినకరు సర్వలోకాతీతు
సురలోకవంద్యు విశుద్ధచరితు
భాస్కరు విష్ణునిమలపటినేత్రంబు
నుద్దామధాముఁ బుణ్యాని నజేయుఁ
గలువలదాయను ఘనుని లోకమునందు
జరిగెడు పనులను జక్కఁబెట్టు

తే॥ గీ॥ వివిధ కౌశలిఁ గోరికల్వేగఁదీర్చు
వాని సుగ్రీవపితరుని భక్తివినయ
మగ్గలంబుగ నొసగెను మహితధైర్య
మప్డు శ్రీరామచంద్రున కర్యముండు

సీ॥ పంచబాణంబుల ఫాలంబు నొప్పింప
నారుబాణంబుల నతనిఁ గొట్టు
సప్తశరములను సక్రోధుడై యేయ
దశములు నొప్పించి తలలనేయు
రామరావణులిట్లు రాజితయుద్ధంబు
సేయగ రఘువంశసింహ దప్రుడు
నొక్కొక్కశిరమును నొక్కశరమునఁ గూల్ప
నలరితంబుగ నవిజన్మమందు

తే॥ గీ॥ దీనిమర్మంబుఁ దెలియక తీవ్రచింత
నున్న రామునిఁ గనుగొని యోమహాత్మ!
వంతనుడుగుము వీనియుదంతమంత
జనులువొగడగఁ జెప్పెద సరసముగను

సీ॥ పై మాటలాడిన పరమభక్తుని జూచి
రాక్షసనేతను రాముఁడప్డు
జనసుతు వరవిభీషణుని మోమును జూచి
యట్లఁ జెప్పుమనగ నతడుఁ జెప్పె
మున్నాసురాసురు ల్మున్నీటనమృతంబుఁ
ద్రచ్చిననితడును రాక్షసులలోఁ
హెచ్చుండి యమృతంబుఁ గ్రోలినదాదిగ
చావు వీనినిఁ బొంద జంకునసఘ!

తే॥ గీ॥ జఠరభాగంబునందున్న సర్వమరణ
హరము నాగ్నేయబాణంబునంపి యింక
నట్లఁ జేయగ నీతని నాహవమున
సులభముగఁ జంపవచ్చును భూపవర్య!

సీ॥ అనియెడి దైత్యే శ్వరానుజుమాటల
నాలించి రాముండు నతిరయమున
దల్లిఁదండ్రుల నాత్మఁదలచియు నమరుల
యాశీస్సులందుచు నగ్నిబాణ
మప్పుడువిడువంగ మార్తాండ దీధితు
ల్చిమ్ముచు నదియునుజేరి పంక్తి
కంధరుయుదరంబుఁ గడువేగమునఁజొచ్చి
దగ్ధంబొనర్చెను తద్యమృతము

తే॥ గీ॥ శక్తియుక్తులు నన్నియు సన్నగిల్ల
గర్వముడిగియు వివిధసంఘట్టనములు
నల్పుచుండగ రామునిఁజక్కఁజూచి
భావిలంకాధి నేత యిప్పట్టునందె

సీ॥ క్రమందింపువేగమె రాక్షసాధిపునంచుఁ
బలుకగ దశరథపట్టియపుడు
మందహాసముఁజేసి మహినుతికెక్కిన
రామబాణంబును రమ్యమొదవ
సంధించి విడువంగఁ బయ్యనదది దశ
కంఠుని శిరయును గడిమిఁద్రుంచె
హాహారవంబులు నద్దెసగను సుర
లానందమునఁ దేలియాడిరంత

తే॥ గీ॥ నసురసంఘంబులన్నియు నాహవమునఁ
దొలగిపోయిన బద్ధ్రవతోషడగుచు
నావిభీషణుడుండెను నవ్యశోభ
నందబును జూచుచుండగ నపుడుదనుజా

సీ॥ మిథిలాధినాథుని మెలతను దశరథ
జనపాలు కోడలి సకలసుగుణ
ఖని రాముభార్యను గామూచి వర్గంబు
నకువొంగి తెచ్చితి నతసుపర్వ!
నేనప్పుబోధింప నీచాతి నీచంబుఁ
గాఁ దన్నిఁ దూఱితి కరముఁగలిగి
యార్యపోషణుఁడైన యనుజు విభీషణు
వెడలంగఁదోలితి విక్రమాఢ్య!

తే॥ గీ॥ పాకశాసనుదొట్టి దిక్పాలవరులుఁ
దప్పుదురె నీదుయాజ్ఞకుఁ దరుణివాంఛ
నాహవోదగ్రరంగంబునందు రామ
నిశిత బాణంబుచేతన నీల్గితివు

సీ॥ అని విలపించెడి వనజాక్షిఁ గనుగొని
జనపతి యలవిభీషణునిఁ జూచి
పాపుదుఃఖము నుండి వదినను యంచన
నతడుచు యొనరించె నట్లుఁగాగ
తదుపరి దశరథతనయుండు భార్యను
జూచువాంఛతో వాయుసూన కీశ
పతి యంగదాదుల భద్రంబుగాఁగూడి
శింశుపాతరువును జేరి యంద

తే॥ గీ॥ రాక్షసస్త్రీలమధ్యను రాజితముగఁ
జదలవెలిగెడు దినకరు చాయఁదోప
సతత రామ నామామృత ఝురమునందుఁ
దానమాడెడి మగువను దనరఁగాంచె

సీ॥ దుఃఖసంద్రంబునఁ దోగుచు రాముండు
సతినవీక్షింపగ జనకజయును
పతికతిభక్తి నమస్కరించిన సతం
డును శంకఁగల్గి విడువగఁ జనిన
నాశ్చర్యచిత్తులై యఖిలమిత్రులు సాధ్విఁ
జేకొనుమంచును వాకొనంగ
నొరులింటఁగాపురంబున్న లతాంగిని
నేనెట్లుఁగైకొందు నిఖిలజనులు

తే॥ గీ॥ నన్ను నిందింపరేయంచు నతఁడువలుక
సమయ విదులగుజనులు వైశ్వానరాగ్ర
శిఖలనుంచిన సత్యంబుఁ జిక్కఁగలదు
తత్ప్రయత్నంబుఁజేయుడు తథ్యముగను

సీ॥ అనఘుడు పటులంత నగ్నినిఁబురికొల్ప
మంటలందిశలెల్ల భగ్గుమనగ
సీతామహాసాధ్వి చెలువుగ భర్తను
దలచి యగ్నినిఁజొచ్చె దైవ్యస్ఫూర్తి
భయపడియనలుండు పాపహారిణియైన
సీతనుగాల్చక సిగ్గుఁజెంది
హస్తయుగ్మంబున సతిననుగ్రహియించి
రామునిచెంతఁజేరంగ నెల్ల

తే॥ గీ॥ వారు విస్మయమందగ బలికె నిట్లుఁ
బుణ్యచరితను శంకనుబొందనేల
శుద్ధదేహంబుఁగలిగి సుశోభితముగ
నున్నదిప్పుడుఁ జేకొను మనసనంద!

సీ॥ అనిరాముఁ బ్రార్థించి యనలుండు సీతనా
తనిసన్నిధినిఁ బెట్టి తానరుగఁ
హర్షపరిప్లుత యనురాగచేతనుం
డై నాతిఁ గౌఁగిటనదుమఁ బట్టి
లాలించి నాయపరాధముల్ క్షమింప
వే యన్న భర్తను విద్రుమోష్ఠి
జరిగినదానినిఁ జర్చసేయుట నేల
నాకర్మమిట్టు లనంతవిధముఁ

తే॥ గీ॥ గాగయుండిన ననిపల్కెఁ గమలహితతన
నూజుడప్పుడు సకలసన్నుతచరిత్రు
నలవిభీషణు లంకకు నధిపుఁ జేయు
మంచు విన్నపమాడెను భర్తవరదు

సీ॥ మున్నుఁ దానిచ్చిన ముఖ్యవాక్యంబున
రావణానుజునప్డు రాజుఁ జేయ
మనమున ఘనముగ బాగుగయోచించి
వరచతుస్సంద్రంపు వారితతులఁ
గడగిఁ దేరఁ బనిచెఁ గరువలిసూను నం
గదు లాదిగనునొప్పు ఘనబలులను
తక్కటిరాక్షస తండముల్ గొల్వగ
దేవేంద్రవైభవ దీప్తిఁ దనరి

తే॥ గీ॥ రాష్ట్రరక్షణుండు వివిధమాల్యానులేప
చందనంబుల ఘుమఘుమ చాలఁ గలిగి
యున్న నభిషేకవిధులన్ని యుక్తముగను
సరసఁ బల్కిరి శేముషీజనములంత

సీ॥ భద్రంబునొసఁగని మణులకిరీటంబు
శిరమున నుంచెను సీత సుదతి
విజయోస్తుయంచని పీఠంబు వాయుజుం
డాతపత్రముపట్ట నపుడు భక్తి
పాదరక్షలనిచ్చె బహుగుణ సంపూర్ణ
జయజయయని రమాజానియంత
రత్నసంయుక్త వరాంగుళీయంబును
భాసిల్లఁజేసెను వాలిసుతుఁడు

తే॥ గీ॥ గామలోభాది విహిత రామభక్త
యనుచు సింగంపుటీరిపై నమరనుంచి
శాశ్వతంబుగ జనులను సకలసుఖము
లందఁ బాలించి దైతేయరాజ్యమునకు

సీ॥ ప్రభువుడవై చక్కఁగఁ బాలింపుమంచు నా
రాముండు దీవించి రాజ్యభార
మంతయునిచ్చి ధర్మమార్గంబు నేపట్టి
నడుపుము యంచని నవ్యపటిమ
సకలధర్మంబులు సకలశాస్త్రంబులు
బోధించి రిపులనుబోరఁగెల్పి
వర్ధిల్లు నామీఁది వదలిన భక్తిచే
బ్రహ్మలోకముఁ గాంచుమని దశరథ

తే॥ గీ॥ తనయుఁడాడగ రావణుతమ్ముఁడప్పు
రామచంద్రునిఁ గొనియాడి రాజితంబు
లైన హయముల గజముల రమణనిచ్చె
నతనిసాహయ్యమునకుఁ దానాత్మ మెచ్చి

సీ॥ ధరణిని బాధించు దైతేయవర్యుల
నిద్దఱి రాముండు నీల్గఁజేసె
ననుచు మోదముఁజెంది నలువదొట్టి వివిధ
సురలేగుదెంచి విశుద్ధచరితు
జనకజాధిపు రాము సంస్కృత పదముల
ఘనముగ నిట్లని గములుఁగూడి
రావణాసురమార! రఘువంశతోయధి
చంద్రమ! నుతగుణ! సారసాక్ష!

తే॥ గీ॥ దివిజసంపూజ్య! దేవ! యాదిత్యతేజ!
పతితపావన! రామ! పాపౌఘహరణ!
యనుచు నుతియించి రంత నహర్నిశలును
నిటలతట ఘటితాంజలి పుటయుగము

సీ॥ మఱియును రఘురాము మహిమలు పొగడుచు
భాషించిరిట్లు సుపర్వవరులు
నీ బాహుబలమున నీచంబుగా దశ
కంఠుఁడీల్గెను ఘోరకదనభూమి
లక్ష్మణునిచేత నారావ పరంపర
మిత్తిచెంతకుఁజేరె మేఘనాదు
డసురాధినేత నిర్విషులుడై ధ్యానించు
సతతంబు భవదీయ సాయమునను

తే॥ గీ॥ మాదు ప్రార్థనఁజేసి నీభక్తతతిని
రక్షసేయుము వైరుల రణములందుఁ
దిరిగి చంపుము నిన్ను నుతింపఁదరమె
జనకజామాత! కోసలసార్వభౌమ!

సీ॥ సన్మునీశ్వరులచేఁ జక్కఁగఁ జేయించి
స్థాపించె దానినిసలిలరాశి
తీరంబునందున దివిజులువొగడగ
నదియుఁ బుణ్యక్షేత్ర మయ్యెనిప్పు
"రామేశ్వరంబన" లక్ష్మణాగ్రజుడంతఁ
గౌబేరమందునఁ గడుజపమునఁ
బోవుచుఁ గమనీయపుణ్యస్థలంబులఁ
గాంచుచు ఋశ్యమూకంబుఁ జేరి

తే॥ గీ॥ సితకంతయునెఱిగించి సిరులఁగులుకు
పంపతటమునుజేరి కబంధుఁదునిమి
నట్టి మొదలగురావుల నన్నిజవక
టకనుజూవుచు దండకన్వరిసఁజేరి

సీ॥ సలలితంబౌ వనచయములు సరసీచ
యంబులు నదులు విహంగతతులు
పరిపక్వఫలభార భాసురకుజములు
సెలయేటితంగము ల్చెలగుచుండ
సకలంబుఁజూచుచు వికవికల్చేయుచు
దండకన్నాటి యుద్దండలీలఁ
జనివని పేరొందు సన్మునీశ్వరులగే
హములనుగాంచి యానందమొంది

ఆ॥ వె॥ నుతులఁదెక్కఁబొంది నూత్నవిధంబుగ
గడచి నందిపురము ఘనముఁగాగ
నేత్రపర్వమగుచు నెగడొందఁజూచి యా
దిత్యవరులుమెచ్చ దితిజహరుఁడు

సీ॥ కౌసల్య కైకేయి కమనీయ సౌమిత్రి
తల్లియుఁ దక్కిన తాపసులును
నెదురుగానరుదేర నీమంబుతో వారి
పాదపద్మములకుఁ బ్రణుతిసల్పి
సాదృశ్యజనముల సమయోచితంబుగ
నుపగూహనంబిచ్చి యుక్తముగను
పిన్నవయస్కులఁ బ్రేమాతిరేకత
నాశీర్వచనములం నమరఁజేసి

తే॥ గీ॥ ప్రజలనందటి వేఱ్వేఱ భాషణంబుఁ
జేసి కులగురుపైన వసిష్ఠమునిగ
లట్టి తావునకేతెంచె రమణతోడ
నెఱిగి కుశలంబుఁ బ్రశ్నించె నెయ్యముగను

సీ॥ దశరథమహీపుచేఁ దనరాజ్యపాలనం
బంతయుహోవగ భార్యకైక
కోరినవరములఁ గూర్మితో నీయంగ
వనజాతనేత్రుఁడు వనములకును
జనకజసోదరు ల్గానముగవెన్వెంట
రాగఁ బోయెను ల్పత్తరాజ్యమునకు
నిప్పుడు రాముని నేర్పొప్ప రాజ్యాభి
షిక్తుగాఁజేయ వసిష్ఠమునియు

తే॥ గీ॥ వానరానీకమంతటి వనధులకును
వేగిరమ్మునఁబోయి కుంభీంద్రవరదు
కార్యమునకు జలంబుల నార్యహితముఁ
గాగఁ దెమ్మనిబంచెను గడుజవమున

సీ॥ హనుమంత జాంబవంతాదులు ప్రాగ్దిశ
నలనీలముఖ్యులు నస్తదిక్కు
దశముఖానుజుడప్డు దక్షిణదిశను న
య్యంగదాదులు సుత్తరంబునను
ననిలవేగంబున నాల్గుపయోధుల
నీరంబుఁ బాత్రల నెత్తుఁబూర్ణ
ముగను దెచ్చి వసిష్ఠమునివర్యుచెంతను
బెట్టియుండిరి యంతఁ బ్రేమమీరఁ

తే॥ గీ॥ దల్లులందఱు రఘురాము ధర్మమూర్తి
ముగను మంగళసద్వస్తుల్ ప్రోగుసేయ
వివిధసౌరభ సంయుక్త మైన తైల
ములనుయుంచిరి తలను సంకల్పముచేయుచు

సీ॥ మంత్రోక్తవిధులను మంగళస్నానంబుఁ
జేయించి పట్టుపుట్టసింగారించి
భాసురభూషణవ్రాతంబుఁదొడిగియుఁ
జానకీ పాదపద్మములఁబెట్టి
రంభాదితోరణా లంకృతంబుగ రాజ
నగరమును గైసేసి నియమములు
వేదమంత్రములన్ని వినిపింపఁ బట్టాభి
షేకవేదికయొప్పె శ్రీఘనతరె

తే॥ గీ॥ బలపరాక్రమయుక్తులు మంత్రులైన
భరత శత్రుఘ్న లక్ష్మణప్రముఖులంత
నంతనుండిరి ప్రజలును క్రమములందు
నిలిచిచూచుచునుండిరి నెమ్మిమీఱ

సీ॥ సకల మునీంద్రుల సర్వమంత్రములును
గలకంఠకంఠుల గానరవము
సమర విలాసినీ నాట్యరంగములును
భూసురవర్యుల భూరివాక్కు-
లత్యంత మోదము నావహిల్లగఁజేయ
శుభముహూర్తమున వసిష్ఠమునియుఁ
దర్కాలమంత్రిముఁ దనరఁగఁబల్కుచు
మణికిరీటంబును మస్తకంబు

తే॥ గీ॥ నందుఁబెట్టగ నమరులు నలరువానఁ
గురియుచుంట్లుగఁజేయ నక్కులగురుండు
నందజానందచిత్తులై యాదిపాద
రామదేవుని కాశీస్సు లమరఁజేసె

సీ॥ స్వస్త్యస్తుసీకని సకలతాపసులాడ
మంగళంబని రమాభర్తయాడ
రావణజేతని లక్ష్మణుండునుబల్కు-
నంగదుం డాహ్లాదమందుఁబలుక
విక్రమాదిత్య గంభీర పాలింపుము
శివము సిద్ధించని దివిజులాడ
సీతావభక్తిని నేనుంటేజేతు
ననుచు వాయుజాతుడు నమరఁజెప్ప

తే॥ గీ॥ లోకకంటకుఁదునిమి యీలోకమందు
శాంతిఁగలిగించి రక్షించి శరణమొసగి
తమనుతియించె దశముఖుతమ్ముదప్డు
నిటలతటమందుఁ గరయుగ పుటులునగుచు

సీ॥ సూర్యచంద్రాదులు సొక్కియుండుటమాని
తేజోధికంబుగఁ దీవ్రమయిరి
సామంతరాజులుఁ జాలభీతినిమాని
సంతోషవంతులై శ్రద్ధులైరి
అష్టదిక్పాలురు సణగియుండుటమాని
తమతమపనులను దప్పరైరి
సర్వలోకము దుఃఖసంతప్తతనుమాని
కార్యభారములందు ఘనతనైరి

తే॥ గీ॥ భక్తులెల్లను దమతమబంధములను
రామనామోచ్చరణచేత లంఘనంబుఁ
జేసి సుఖియించి రప్పుడుఁ జిన్మయుండు
రామచంద్రుండు ధరణీభారంబుఁదాల్ప

సీ॥ వర్షముల్ మూఁడును వత్సరంబునఁగల్గ
సస్యాధిఫలములు సర్వవృద్ధిఁ
గాంచును వనములుఁగ్రమంబుగానుండు
నిర్ఝరానీకంబు నిండుఁగులుకు
పతిభక్తిఁగలిగి యాభామలువొప్పుదు
రన్యోన్యఘర్షణా రహితులగుచుఁ
బ్రజలువర్తింతురు రాగాదిచోరభ
యంబులులేవు పుణ్యాదికార్య

తే॥ గీ॥ జాలమంతయు సతతమ్ము జరుగుచుండు
దైవభక్తినివిడువరు ధర్మజనము
పూర్వరాజుల పాలనాబుద్ధితోడ
ప్రజలు సుఖపడిరా రామరాజ్యమందు

సీ॥ కందర్పబాధిత గాఢమతినిఁజిక్కి
నలుగురుతమ్ములుఁ జెలులఁగూడి
సౌఖ్యానుభోక్తలై సరసలీలలఁదేలి
యాడగ వరుసగ నందఱికిని
పుత్రద్వయంబు జగత్త్రయప్రఖ్యాతి
గనుబుట్టి రప్పుడు ఘనతనొప్పి
వారిలోఁ గుశలవవరపుత్రులిద్దఱు
వాసిఁగాంచిరి వారిబహుళకావ్య

తే॥ గీ॥ ములకు నంతటఁగౌతుకుల ముద్దుముచ్చ
టలనునారసి తోషించి కులవరుండు
రాజ్యభారంబునంతను లవకుశులకు
నిచ్చి యాధ్యాత్మికాసక్తి నిచ్చగించి

సీ॥ పట్టాభిషేకంబు భాసురంబుగఁజేసి
రాజ్యమంతయుఁబెట్టి రమణతోడ
నుండిననొకనాడు దండధరుండును
రాముతోభాషింప లలినివచ్చి
యేకాంతవాసంబు నిచ్చగింపగ లక్ష్మ
ణుండప్పు డన్నకుద్యోగియయ్యె
సంభాషణామధ్య సమయంబునందున
డ్డంకులేర్పడ నప్పు డంబుగ రము

తే॥ గీ॥ రామదేవుడుఁ దమ్ముని ధీమహితునిఁ
జంపఁజాలక విడిచిపుచ్చగను సరయు
నదినిఁగ్రుంకియు శేషునిపదముఁజెందె
నంత రఘువీరుడందఱి వంతఁదీర్చి

సీ॥ సీతయుఁదనదైన చిరతపస్థానంబుఁ
దొల్లిఁజేరెను రామదూతపావ
నియును దక్కటివారునేగిరి తమతమ
నెలవులకప్పుడు నియమముగను
తమ్ములుముగ్గురుఁ దనకంటెముందుగ
వైకుంఠవాసులై వఱలిరనుచు
బ్రహ్మాదిసురల సంప్రార్థితుండై తన
జన్మకర్మంబులఁ జక్కఁదెలిసి

తే॥ గీ॥ యుగసమాప్తినిగుర్తించి యుక్తకార్య
ములను నన్నిటిఁజేసి సంపూర్ణమైన
పరమపావనశుభదంబు భద్రకరము
నైన "వైకుంఠము"నకుఁబో నపుడుఁదలచి

సీ॥ సకలబంధువులను సత్కారములఁజేసి
వారిచే మన్ననఁబడసి పుణ్య
కార్యములొనరించి ఘనసరయూతట
మందుఁజేరగ నద్భుమంగళముగ
సురగరుడోరగ సిద్ధాదిదేవతా
రాశులు లంతట రహినిమెప్పె
గౌతమాత్రివసిష్ఠ కౌండిన్య శాద్గల
భరిత విశ్వామిత్ర పరమమునులు

తే॥ గీ॥ వచ్చిరప్పుడు రఘువంశవనధిసోము
మోముఁగనుగొన ఢమరుకముఖ్యనాద
ములను విలసిల్లె నంబరమునను సర్వ
దిశలువెలుఁగొందె నంతట దశముఖారి

సీ॥ ధర్మమణిప్రదీప్తంబయి చెలువొందు
దివిజవిమానంబుఁ దేజరిల్ల
నారోహణముఁజేసి యమరాదిబృందంబు
లన్నియుఁబొగడగ రాఘవుండుఁ
బ్రజలసందటికిని పావనమౌముక్తి
నొసగియు రంభాదిసూత్నఖచిత
రత్ననిబద్ధమై రాజిల్లు మంటప
సముదయయుక్తమై గములుఁగలిగి

తే॥ గీ॥ నిత్యలక్ష్మినివాసమై భృత్యగణముఁ
గలిగివిలసిల్లు వైకుంఠఘనపురంబుఁ
జేరె మానవాకారంబుఁదీఁటి తనదు
మొదలినెలవును రోకాళి మోదమంద

"యుద్ధకాండము - సంపూర్ణము"

# ఫలశ్రుతి



సీ॥ జలధిరక్కసుని మత్స్యావతారంబున
గురుతరశైలంబుఁ గూర్మరూపు
నను హిరణ్యాక్షుని ఘనవరాహంబున
వంహేమకశిపుని నరమృగేంద్ర
ముగను బలీంద్రుని మూడడుగులడిగి
వామనరూపున భార్గవాంశ
లోనజన్మించియు రూక్షేక్షణంబుల
సకలరాజులనెల్ల సంహరించి

తే॥ గే॥ తండ్రియానతి వనముల ధర్మపత్ని
యుక్తముగఁబోయి కీర్తి మహోన్నతంబు
నందునార్జించి దుష్టులడిందువఱచి
రాముఁడొప్పారె రవికులసోముఁడగుచు

ఉ॥ నల్లనిదేహధారి రఘునాయకు డబ్జజతండ్రి జానకీ
వల్లభు డార్తరక్షణ నవశ్యముఁజేయు సుధీరుడుం బ్రియం
బుల్లసిలంగ భక్తులసుబుద్ధినిఁబట్టెడువాడు నిచ్చలున్
చల్లనిచూపులుంచి మిము సర్వవిధంబుల నోముగావుతన్

చ॥ పరమపవిత్రయుక్తమగు భాసురరామచరిత్ర నెవ్వరై
న రతిఁబఠింప విన్న నరనాయకు డాశ్రితపారిజాతుఁడున్
దురితలతాలవిత్రకుఁడుఁ దోషితభూజసుతున్ మనోహరం
దరిజనభీముడాతడు మహత్పదమిచ్చి ధరించువారికిన్

మ॥ ఒకమాఱెవ్వనిపేరు కష్టములలో నూహించి భాషించినన్
సకలాఘంబులు చిత్తమాత్రముననే సంహారముంజెందు న
త్యకలంకస్థితిఁ గొల్చు భక్తులకు నిత్యానందముంగూర్చు న
త్సుకరుండౌ రఘురాముడిచ్చు సతతమున్ తూర్ణంబ కల్యాణముల్

శా॥ శ్రీరాజిల్ల నయోధ్యపట్టణమరీచీజాలముల్ పర్వ సీ
తారామామణి నంకపీఠమున మిత్రానీకము ల్గొల్వగా
భారద్వాజ వసిష్ఠ గౌతమమునుల్ వాతాత్మజుం డుండగన్
ధీరప్యుండగు దేవుడిచ్చు విమలోద్దీప్తంబులౌ లౌకముల్

క॥ స్థిరముగ "రాముని చరితము"
నరయగఁ "గాశ్యపకులంబు" నందుద్భవమొం
ది రహినిరచియించిరి యా
పురుషులు "శ్రీకృష్ణశర్మ" ముఖ్యులు దండిన్

శ్లోకము

"మంగళమ్" కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్

"ఓంతత్సత్"

"నిర్వచన సంగ్రహరామాయణము సంపూర్ణము"

ఈమని వేంకటకృష్ణయ్య

యల్లయపాళెము